# ముందుమాట



బ్రహ్మనాయుడు, పల్నాడు ప్రాంతంలో ఈ పేరుకు పరిచయం అక్కరలేదు.అదే నా పేరు.మాచర్ల నా జన్మ స్థలం.ఎక్కడికి వెళ్ళినా నా పేరు నాకొక ప్రత్యేక గుర్తింపు ఇచ్చింది.చరిత్రలో మాచర్లకు నాడు,నేడు ఒక ప్రత్యేకత ఉంది.పట్టణంలోనే ప్రాథమిక,హైస్కూల్ విద్య పూర్తి చేశాను.ఎందరో పల్నాటి చారిత్రాత్మక వ్యక్తులను తయారుచేసిన పల్నాటి విద్యాకర్మాగారం ఎస్.కే.బి.ఆర్ కళాశాలలో ఇంటర్,డిగ్రీ పూర్తి చేశాను.గుంటూరు వెళ్లి పై చదువులు పూర్తి చేశాను.ఆచార్య నాగార్జున యూనివర్సిటీలో జర్నలిజం అండ్ మాస్ కమ్యూనికేషన్ పూర్తి చేశాను.న్యాయవిద్యలో పట్టా పొందాను. పలు మాస్టర్స్ కోర్సులు చదివాను. **ది అమరావతి వాయిస్** అనే పత్రిక ప్రారంభించాను.పల్నాడు ప్రాంతంపై పలు పుస్తకాలు ముద్రించిన విషయం అందరికీ తెలిసిందే.చరిత్రలో మాచర్ల స్థానం ప్రత్యేకం. నాటి పల్నాటి యుద్ధం నుండి నేర్చుకోవాల్సిన పాఠాలు ఎన్నో ఉన్నాయి.పల్నాటి యుద్ధవీరుల గూర్చి రకరకాల కథనాలు ప్రచారంలో ఉన్నాయి.శ్రీనాధుడు రాసిన పల్నాటి చరిత్ర పూర్తి స్థాయిలో లభ్యం కాలేదు.చరిత్రకారులు ఎక్కువగా నాగమ్మను, కన్నమదాసును తక్కువగా చేసి చూపారు.పూర్తిస్థాయి ఆధారాలు లేకుండా ఏ చరిత్రను నమ్మడానికి వీలులేదు.మాచర్ల పట్టణంపై పుస్తకం ముద్రించడానికి ముందు పలువురు సీనియర్ కవుల అభిప్రాయాలతో పాటు చరిత్ర తెలిసిన కొంతమంది పెద్దలు, సోషల్ మీడియాలో లభ్యమైన సమాచారం ఆధారంగా చారిత్రక విషయాలను తెలియజేస్తున్నాను. వ్యక్తిగత సిద్ధాంతమే పల్నాటి యుద్ధాన్ని తెచ్చింది అనడంలో ఏమాత్రం సందేహం లేదు.స్త్రీలు వంటింటికి మాత్రమే పరిమితమైన రోజుల్లో పలు యుద్ధవిద్యలు నేర్చి,సామ్రాజ్యాన్ని నడిపించే నాయకురాలుగా ఎదిగిన నాగమ్మ ధీరత్వాన్ని కొనియాడాల్సిందే. పల్నాటి యుద్ధంలో బ్రహ్మనాయుడు ఎక్కడ యుద్ధం చేసినట్టుగా లేదు. రాజులు కదా యుద్ధం చేసేది.అతను ఒక మంత్రి. కన్నమ దాసుతోపాటుగా 66 మంది వీరులు కథనరంగంలో మృతి చెందారు. బ్రహ్మనాయుడు ప్రవేశపెట్టిన చాపకూడు సిద్ధాంతం దేశానికే ఆదర్శం.పల్నాటి రాజుల వైభవాన్ని తెలిపే కోటలు ఏవి లేనప్పటికీ యుద్ధం చరిత్రలో ఎంతో ప్రాధాన్యతను సంతరించుకుంది. మాచర్ల పట్టణం ఎంతో చారిత్రాత్మకమైన స్థలం. ఇక్ష్వాకుల పాలనలో, విష్ణుకుండినుల పాలనలో, హైహేయ రాజుల పాలనలో ఈ పట్టణం ఉన్నది. చారిత్రాత్మకమైన చెన్నకేశవ దేవాలయంతోపాటు కొన్ని జైన దేవాలయాలు నిర్మించబడ్డాయి. చీమలు పెట్టిన పుట్టలు పాములకు నివాసమైనట్లు అవి హిందూ దేవాలయాలుగా మార్చబడ్డాయి. నాటి పల్నాటి పరిస్థితులు పూర్తిగా తెలియాలంటే కవి సార్వభౌముడు శ్రీనాథుడు రాసిన పల్నాటి చరిత్ర చదవాల్సిందే. చరిత్రలో కొంత భాగాన్ని ప్రస్తావిస్తూ, ప్రస్తుత పట్టణ ప్రత్యేకతను తెలియజేసే చిరు ప్రయత్నమే ఈ పుస్తకం. నేటి మాచర్ల పట్టణంలో రాయవరం జంక్షన్ నుండి కొత్తపల్లి జంక్షన్ వరకు విస్తరించి ఉన్న పట్టణం మాచర్ల. పల్నాడు జిల్లాలో మాత్రమే కాకుండా మాచర్ల నియోజకవర్గం అంటే రాష్ట్రస్థాయిలో గుర్తింపు ఉన్నది.కేవలం పౌరుషం, పగ, ప్రతీకారాలు మాత్రమే కాకుండా అనురాగం,ఆప్యాయత కూడా అంతే స్థాయిలో పంచుతారు. పట్టణంలో ఉన్న విద్య,వైద్య,చారిత్రక,ఆధ్యాత్మిక, సామాజిక విషయాలు తెలిపేలా ఈ పుస్తకం ఉంటుంది.దాతలు సహకరిస్తే ముందు రోజుల్లో మల్టీ కలర్ పుస్తకాన్ని అందించగలము.పల్నాడుకు సంబంధించిన పలు విషయాలు ముద్రించిటకు ఎంతో ఆసక్తిగా ఉన్నాము.పుస్తక ముద్రణకు ప్రకటనలు ఇచ్చి ఎంతో ప్రోత్సహించినవారికి,నిత్యం వెన్నుతట్టి ప్రోత్సహిస్తున్న స్థానిక మిత్రులు,పెద్దలు,శ్రేయోభిలాషులకు హృదయపూర్వక నమస్కారాలు. పట్టణ చరిత్రకు సంబంధించి ఏదేని విషయం మేము మరిచినయెడల సహృదయంతో మాకు తెలియజేసినఎడల మలి ముద్రణలో జ్ఞాపకం చేసుకుంటామని తెలుపుతున్నాను.ఈ ప్రయత్నానికి ఎంతో కృషిచేసిన మిత్రుడు మా పత్రిక పల్నాడు జిల్లా ఇన్చార్జ్ ఎస్.కోటేశ్వరాచారికి, మాచర్ల నియోజకవర్గ పత్రిక బృందానికి ప్రత్యేక అభినందనలు.


ఎస్. కోటేశ్వరాచారి,
పల్నాడు జిల్లా ఇన్చార్జ్,
ది అమరావతి వాయిస్,మాచర్ల.
9666397807.

బ్రహ్మనాయుడు
ఎడిటర్,
ది అమరావతి వాయిస్,
9848343195.

# మాచర్ల పట్టణం

మాచర్ల పట్టణానికి తూర్పున రాయవరం జంక్షన్, పడమర కొత్తపల్లి జంక్షన్, దక్షిణాన మండాది బోదు,ఉత్తరాన సాగర్ కుడికాలువ ఉన్నాయి.రాయవరం జంక్షన్ వద్ద ద్విముఖ ఆంజనేయస్వామి విగ్రహం దాటి పట్టణంలోనికి ప్రవేశించినపుడు చంద్రవంక బ్రిడ్జి కన్పిస్తుంది.పట్టణంలోని మెయిన్ రోడ్డు హైదరాబాద్‌లో ట్యాంక్‌బండ్‌ను తలపించేలా పలు విగ్రహాలతో కనులవిందుగా ఉంటుంది.బస్టాండ్ ప్రక్కనే మాచర్ల టౌన్ మరియు రూరల్ పోలీస్ స్టేషన్లు,వాటిని అనుకొని రిజిస్టార్‌ఆఫీసు,120సంవత్సరాల క్రితం నిర్మించబడిన తహసిల్దార్ ఆఫీస్ ఉంటాయి.పట్టణంలో హెూటల్స్, లాడ్జిలు, కళ్యాణ మండపాలు,






డాక్టర్ బి.ఆర్.అంబేద్కర్ పార్క్ సెంటర్

ప్రజలకు అవసరమైన అన్ని సౌకర్యాలు ఉన్నాయి. పట్టణం నడిబొడ్డున డాక్టర్ బి.ఆర్.అంబేద్కర్ పార్క్ ఉన్నది. పార్క్ సెంటర్ కుడివైపు వ్యాపారాలకు హాస్పటల్ కు కేంద్రమైన రామాటాకీస్ లైన్, దక్షిణాన కూరగాయల మార్కెట్ మీదుగా చెన్నకేశవస్వామి దేవాలయానికి వెళ్ళవచ్చు. చారిత్రాత్మకమైన చెన్నకేశవదేవాలయం,పరశు రాముడు నిర్మించిన రామప్ప దేవాలయం, దాదాపు 100 సంవత్సరాలు క్రితం నిర్మించిన సత్రం,పలు జైన దేవాలయాలు, ఔరంగజేబు నిర్మించిన మసీదుతో పాటుగా పలు ప్రాముఖ్యమైన నిర్మాణాలు పట్టణంలో ఉన్నాయి. విద్యా వైద్య వ్యాపార రంగాలకు నియోజకవర్గమంతటికి మాచర్ల పట్టణమే ముఖ్య ప్రాంతం.ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ విభజన అనంతరం రాష్ట్ర రాజధాని పరిశీలన పేర్లలో మాచర్ల పేరు కూడా వినిపించింది.

1987 సంవత్సరంలో మేజర్ పంచాయతీగా ఉన్న మాచర్ల మున్సిపాలిటీగా అవతరించింది.రామాటాకీసు వీధిలోనే ప్రధాన వాణిజ్యసముదాయాలూ, ఆసుపత్రులూ,మందులషాపులూ,సినిమాహలు వుండడంతో ఎప్పుడూ జనంతో కిటకిటలాడుతూవుంటుంది.కె.సి.పి.సిమెంటుఫాక్టరీ 1958లో స్థాపించబడి,నాగార్జునసాగర్ ప్రాజెక్టుకు,శ్రీశైలం జలవిద్యుత్ ప్రాజెక్టుకు సిమెంటు సరఫరా చేసింది.ప్రస్తుతం దక్షిణభారతదేశంలోనే అత్యధికంగా సిమెంటు ఉత్పత్తిచేసే కర్మాగారాల్లో ఒకటిగావుంది.



పట్టణ శివారులో జమ్మలమడక గ్రామం వెళ్లేదారిలో పైన నీరు ప్రవహిస్తూ, క్రింద నుండి బస్సులు వెళ్ళే విధంగా నాగార్జునసాగర్ కుడి కాలువ నిర్మించారు.



రాయవరం జంక్షన్

# చరిత్రలో మాచర్ల



హైదరాబాదులో ట్యాంక్ బండ్ పోలినట్లు పట్టణంలో పలు విగ్రహాలు.



మార్కెట్ వద్ద ముఖద్వారము

పల్నాడు అనగానే మనకు గుర్తొచ్చే పేర్లలో మొదటిది మాచర్ల. చరిత్రలో తనకంటూ ఒక ప్రత్యేక స్థానమును సంపాదించడంతోపాటు ప్రస్తుత రాష్ట్ర రాజకీయ చరిత్రలో కూడా ప్రత్యేక గుర్తింపు పొందినది మాచర్ల.పల్నాడు,పలనాడు లేదా పల్నాడు, పూర్వపు గుంటూరు జిల్లాకు ఉత్తర ప్రాంతాన ఉంది. 2022లో జిల్లాల పునర్వ్యవస్థీకరణలో భాగంగా పల్నాడు ప్రాంతం నరసరావుపేట ప్రధాన పరిపాలనా కేంద్రంగా పల్నాడు జిల్లాగా ఏర్పడింది. నరసరావుపేట పట్టణం పల్నాడు ప్రాంతానికి ముఖద్వారం అని నానుడి. పల్నాడు ప్రాంతంలో దాచేపల్లి గురజాల, మాచర్ల, కారంపూడి ముఖ్య పట్టణాలు. ఆంధ్ర కురుక్షేత్రంగా ప్రసిద్ధికెక్కిన పలనాటి యుద్ధం తెలుగు చరిత్రలో ఒక ముఖ్య ఘట్ట.ఆంధ్ర పల్లవులు నివసించినప్రదేశమే పల్లవనాడని, తరువాత నేడు పల్నాడని పిలవబడింది.

చిన్న చిన్న రాళ్ళు చిల్లర దేవుళ్ళు
నాగులేటి నీళ్ళు నాపరాళ్ళు
సజ్జ జొన్న కూళ్ళు సర్పంబులును తేళ్ళు
పల్లెనాటి సీమ పల్లెటూళ్ళు

–ఇది శ్రీనాథ కవిసార్వభౌమ విరచితం.

**"పలనాడు వెలలేని మాగాణిరా!"** ఇది పులుపుల వెంకట శివయ్య అన్న మాట.మాచర్ల,పల్నాడు జిల్లాకు చెందిన పట్టణం,గుంటూరుకు 120 కి.మీ. దూరంలోను,జిల్లా కేంద్రమైన నరసరావుపేటకు వాయవ్య దిశలో 80 కి.మీ దూరంలో వుంది.హైహయరాజుల కాలంలో ఈ ప్రాంతంలో గొప్పచెరువు వుండేదని,దానిమధ్యలో మహాదేవిఆలయం వుండడం వలన ఈ ప్రాంతానికి **మహాదేవిచర్ల** అనే పేరు వాడుకలో మాచర్లగా రూపాంతరం చెందిందని చరిత్రకారుల కథనం.త్రేతాయుగంలో మాచర్ల ప్రాంతం దండకారణ్యంగా ఉండేది.అప్పుడు మాచర్లని విష్ణుపురి అని పిలిచేవారు.బ్రహ్మనాయుడు స్వస్థలం మాచాపురం పేరు మీదుగా మాచర్ల పట్టణం నిర్మించాడని కూడా చెపుతారు.కొన్నాళ్లు మాహాదేవిచర్లగా వాడుకలో ఉండి క్రమేణా మాచర్లగా ప్రసిద్ధి కెక్కింది.పల్నాటి యుద్ధం క్రీస్తు శకం.1182లో మాచర్ల, గురజాల పట్టణాల మధ్య జరిగింది.హైహేయరాజుల కాలంలో ఈ పట్టణము సస్యశ్యామలముగా **వెలసిల్లింది**.బ్రహ్మనాయుడు కాలంలో పల్నాటి రాజ్యము రెండుగా విభజింపబడి గురజాల,మాచర్ల రాజధానులుగా పరిపాలన కొనసాగించారు.కవి సార్వభౌముడైన శ్రీనాథుడు పల్నాడును సందర్శించి పల్నాటి చరిత్ర అనే గ్రంథాన్ని వ్రాశాడు.పల్నాడులో రాజుల పాలన ఉందని చరిత్ర చెబుతున్నప్పటికీ నాటి రాజులు నిర్మించిన కట్టడాలు కానరాక పోవడం విశేషం.కులమతాలకు అతీతంగా అందరూ సమానమేనని మాచర్లలో బ్రహ్మనాయుడు ప్రవేశపెట్టిన చాపకూడు సిద్ధాంతం నేటి సమాజ సంస్కర్తలకు మాదిరి.చరిత్రలో అలనాటి సామ్రాజ్యానికి మాచర్ల పట్టణం ముఖ్య కేంద్రంగా వెలసిల్లింది.ఉమ్మడి పల్నాటి రాజ్యము రెండుగా విడిపోయిన సందర్భంగా మలిదేవరాజుకు మంత్రిగా బ్రహ్మనాయుడు ఉంటూ మాచర్ల రాజధానిగా పాలన సాగించగా,గురజాల పట్టణానికి నలగామరాజు నాగమ్మను మంత్రిగా నియమించి రాజ్యాన్ని పాలించారు. పల్నాటి యుద్ధం తరువాత కాకతీయ సామ్రాజ్యంలో విలీనమైంది.

## 'పల్నాడు' అనే ఎందుకు పిలుస్తారు

పల్నాడు అనే పేరు రావడానికి అనేక కారణాలు ప్రచారంలో ఉన్నాయి. తొలుత పల్లవులు పాలించిన ప్రాంతం కాబట్టి పల్నాడు అన్నారని కొందరు, పలు గ్రామాల సమూహం కనుక పల్నాడు అయ్యిందని ఇంకొందరు చెబుతున్నారు.అయితే తెలుగునాట వెల్నాడు, పోల్నాడు, వేగినాడు, కోర్నాడు ఇలా అనేక పేర్లున్నాయి. వాటికి ప్రత్యేకతలు కూడా ఉన్నాయి. పల్నాడు కూడా అదే పరంపరలో వచ్చిందనే అభిప్రాయం ఉంది. నాడు అంటే ప్రాంతం కాబట్టి వలనాడు అనేది కాలక్రమేణా పల్నాడుగా స్థిరపడిందని చరిత్ర .పలపలనాడు అంటే బాగా వెలుగొందిన ప్రాంతం కాబట్టి అందులో చివరకు పల్నాడుగా మిగిలి ఉంటుందనే అభిప్రాయం కూడా ఉంది.పల్నాడు చరిత్రకు సంబంధించి స్పష్టమైన ఆధారాలు లేకపోవడంతో ఆ పేరుకి కూడా వివిధ భాష్యాలు చెబుతూ ఉంటారు.



## పల్నాడు ప్రాంతం ఏది?

పల్నాడు ప్రాంతం గురించి కూడా స్పష్టత లేదు. గుంటూరు జిల్లాలోని గురజాల, మాచర్ల ప్రాంతంతో పాటుగా ప్రస్తుతం ప్రకాశం జిల్లాలో ఉన్న మార్కాపురం డివిజన్ లోని కొన్ని గ్రామాలను కూడా కలిపితే పల్నాడుగా చెబుతుంటారు.అయితే నరసరావుపేటని పల్నాడు ముఖద్వారం అంటూ కొందరు చెబుతున్నప్పటికీ కొండవీడు ప్రాంతంలో ఉన్న నరసరావుపేటకి పల్నాడుతో సంబంధం లేదనే అభిప్రాయాన్ని చరిత్ర పరిశోధకుడు ఎం.గోపాల్ రెడ్డి వ్యక్తంచేశారు.గురజాల, మాచర్ల నియోజకవర్గాలుగా ప్రస్తుతం పిలుస్తున్న ప్రాంతాలతో పాటుగా సమీపంలోని పలు గ్రామాలన్నీ పల్నాడుగా పిలుస్తుంటారు. 1962కి ముందు పల్నాడు పేరుతో అసెంబ్లీ నియోజకవర్గం కూడా ఉండేది. అప్పట్లో కాసు బ్రహ్మానందరెడ్డి పల్నాడు అసెంబ్లీ నియోజకవర్గం నుంచి ప్రాతినిధ్యం వహించారు. ఇప్పుడు గురజాల, మాచర్ల నియోజకవర్గ ప్రాంతాలుగా ఉన్న వాటిని పల్నాడు నియోజకవర్గంగా పేర్కొన్నారు

## పల్నాటి చరిత్ర ఇలా మొదలు...

మాహిష్మతిని రాజధానిగా చేసుకుని నర్మదా నదీ తీరంలో హైహయ రాజ్యం ఉండేది. ఆ రాజ్య వంశానికి చెందిన అనుగు రాజు తన శరీరంపై మచ్చలు తొలగించుకోవడం కోసం దక్షిణ భారత యాత్ర చేస్తారు. ఆయన్ని అలుగురాజు అని కూడా అంటారు.కృష్ణా నది వెంబడి పయనించి పలు చోట్ల నదీ స్నానాలు చేస్తూ సాగుతున్న క్రమంలో మాచర్ల సమీపంలోనూ, ఆ తర్వాత అమరావతి ప్రాంతంలోనూ ఆయన నదీ స్నానం చేయడంతో మచ్చలు తొలగిపోయాయని పల్నాడు చరిత్రకు సంబంధించిన పుస్తకాల్లో ఉంది.అదే సమయంలో అనుగురాజుని దేశ బహిష్కరణ చేసినందున, ఆయన వెలనాడు ప్రాంతానికి వచ్చి ఉంటారని కొందరు పేర్కొన్నారు. ఆనాటికి వెలనాడు రాజ్యం ప్రస్తుతం బాపట్ల సమీపంలో ఉన్న చందోలు కేంద్రంగా పాలన సాగించేది. వెలనాటి చోడుల పాలనలో బాపట్ల సమీపంలోని సముద్ర తీరం నుంచి నల్లమలలో ఉన్న అహోబిలం వరకూ ఈ రాజ్యం విస్తరించి ఉండేది. వేంగి చాళిక్యులు, చోళులకు కూడా సరిహద్దు రాజ్యంగా ఉండడంతో నిత్యం యుద్ధాల తాకిడి ఉండేది. చివరకు కాకతీయ సామ్రాజ్యం ఆవిర్భవించడంతో వారికి సామంత రాజులుగా 11వ శతాబ్దం నాటికి 2వ గొంకరాజు పాలనలో వెలనాడు ఉండేది.ఆ సమయానికి అనుగు రాజు కూడా తన మచ్చలు పోయిన తర్వాత ప్రస్తుతం గురజాలగా పిలుస్తున్న ప్రాంతంలో తాత్కాలికంగా స్థావరం ఏర్పాటు చేసుకున్నారు.ఆ సమయంలో జొన్న కంకులు విషయంలో ఓ రైతుకి అనుగురాజుకి తగాదా వస్తుంది.ఆ రైతు స్థానికంగా ఉండే రాజ ప్రతినిధులకు ఫిర్యాదు చేస్తారు.వారు ప్రశ్నించేందుకు వెళ్లిన సమయంలో అనుగురాజు అనుచరులు వారిపై దాడికి దిగుతారు. చివరకు సమస్యని ఆ భటులు గొంకరాజుకి మొరపెట్టుకుంటారు.అనుగురాజు తన వద్ద సైన్యం లేదు కాబట్టి మల్లయుద్ధానికి రావాలని గొంకరాజుని కోరడం, ఆయన అంగీకరించడంతో బాహాబాహీకి సిద్ధమవుతారు.అప్పుడు అనుగురాజు తరుపున దొడ్డపనాయుడి కొడుకు పేరినీడు బరిలో దిగి గొంకరాజు తరుపున వచ్చిన చందోలు వీరులను ఓడిస్తారు.మల్లయుద్ధంలో గెలిచిన అనుగురాజుకి గొంకరాజు కుమార్తె మలిదేవి అని పిలిచే అంబని ఇచ్చి వివాహం చేస్తారు.రేచర్ల వంశానికి చెందిన పేరినీడు, బ్రహ్మానాయుడు సోదరులు కావడం విశేషం.అంతేగాకుండా అనుగరాజుకి తొలుత పిల్లలు లేకపోవడంతో దొడ్డపనాయుడి పెద్దకొడుకు పెద్దన్నను దత్తత తీసుకుంటారు.ఆ తర్వాత మలిదేవికి నలగామరాజు పుట్టాడు. వారితో పాటు ఇతర భార్యల సంతానం కూడా ఉంటారు.అనుగురాజు ఆ తర్వాత గురజాల ప్రాంతంలో అరణం కింద దక్కిన 5ఊర్లకు రాజు అవుతాడు.అనుగురాజుకి దత్తుడిగా ఉన్న పెద్దన్న నాయుడికి వారసత్వం దక్కదు.పెద్దన్న తండ్రి దొడ్డపనాయుడు అనుగురాజు దగ్గర మంత్రిగా ఉంటారు. కానీ మంత్రి కొడుకుని దత్తత తీసుకోవడంతో తనకే రాజ్యం దక్కాలని పెద్దన్ననాయుడు ఆశిస్తారు.వారసత్వ విషయంలో నలగామరాజుతో పాటుగా నరసింహ, మలిదేవుల మధ్య కూడా మనస్పర్థలు వస్తాయి.ఈ నేపథ్యంలో ఇరు వర్గాలకు బ్రహ్మానాయుడు,నాగమ్మ చెరోవైపునా నాయకత్వం వహిస్తారు. ప్రస్తుతం కారంపూడిగా పిలుస్తున్న కార్యంపూడి కేంద్రంగా క్రీ. శ 1176 నుంచి 1182 వరకూ యుద్ధం జరిగినట్టుగా చరిత్ర చెబుతోంది. ఈ యుద్ధంలో గెలిచింది నాయకురాలు నాగమ్మ అని కొందరు కీర్తిస్తే, కాదు పల్నాటి బ్రహ్మానాయుడు అంటూ ఇంకొందరు కొనియాడుతూ ఉంటారు. నేటికీ మాచర్ల ప్రాంతంలో బ్రహ్మానాయుడిని ఆరాధిస్తుంటే, గురజాలలో నాగమ్మని పూజిస్తారు.నాగమ్మ ప్రస్థానం వెనుక కూడా అనేక ప్రచారాలున్నాయి.

# పల్నాటి యుద్ధం



పల్నాటి యుద్ధంలో ముఖ్య భూమిక పోషించిన బ్రహ్మనాయుడు, నాయకురాలు నాగమ్మ ఇరువురు ఇరు రాజ్యాల్లో మంత్రులే. బ్రహ్మనాయుడు మాచర్లను పాలించిన మలిదేవరాజు వద్ద, గురజాలను పాలించిన నలగాముని వద్ద నాగ మ్మ మంత్రులుగా పనిచేశారు. ప్రపంచ చరిత్రలో మొట్టమొదటి మహిళా మంత్రి నాగమ్మే కావటం గమనార్హం.

**యుద్ధానికి దారి తీసిన పరిస్థితులు :** బ్రహ్మనాయుడు వైష్ణవ సంభూతుడు. నాగమ్మ శివ భక్తురాలు. ఎవరి మత ప్రచారం వారు చేసుకున్నా అనాదిగా శివ,వైష్ణవుల మధ్య ఆధిపత్య పోరు కొనసాగుతూనే ఉంది.బ్రహ్మనాయుడు కారంపూడి,మార్కాపురం,మాచర్లలో చెన్నకేశవ ఆలయాలను నిర్మించి తన విష్ణుభక్తిని చాటుకున్నాడు.నాగమ్మ శివక్షేత్రాలను నిర్మించింది. బ్రహ్మనాయుడు దళితులకు ఆశ్రయం కల్పించి దేవాలయాల ప్రవేశం గావించాడు.చాపకూటితో సహపంక్తి భోజనాలను ఏర్పాటుచేశాడు.అగ్రవర్ణాలలో అధిక భాగం నాగమ్మ చెంతన చేరటంతో కుట్రలకు, కుయుక్తులకు తెరలేచింది.కోడిపోరులో పాల్గొనేందుకని బ్రహ్మనాయుడు మాచర్ల నుండి తన ప్రముఖులతో కలిసి కోడేరుగుట్టల వద్దకు ( ప్రస్తుతం ఈ ప్రాంతం రెంటచింతల మండలంలోని పాల్వాయి వద్ద ఉన్నది)చేరుకుంటాడు. పోరులో పాల్గొనటానికి చిట్టెమల్లు అనబడే కోడిని తీసుకొని బ్రహ్మనాయుడు, సివంగిడేగ అను పేరుగల కోడిని నాగమ్మ తెప్పించి పందానికి సిద్ధమయ్యింది. పందెంలో ఓడిన వారు రాజ్యాన్ని వదలి ఏడేళ్ల పాటు వనవాసం చేయాలని షరతు విధిస్తుంది.కోడిపోరులో ఓడిపోయిన బ్రహ్మనాయుడు, మలిదేవులతో కలిసి ఏడేళ్లు అరణ్యవాసంకు వెళతారు.నిర్దేశిత ఏడు సంవత్సరాలు అరణ్యవాసం పూర్తయిన పిమ్మట తన రాజ్యం తనకిమ్మని బ్రహ్మనాయుడు చేసిన విజ్ఞప్తిని,దాయాదుల రాజ్యభాగం తిరిగి ఇవ్వటానికి నలగాముడు తిరస్కరించటంతో పల్నాటి యుద్ధానికి ఇరువర్గాలు సన్నద్ధమయ్యాయి.పలనాటి రణక్షేత్రంగా సుప్రసిద్ధమైన కారంపూడిని ఎంచుకున్నారు. బ్రహ్మనాయుడు సేనలను మాచర్ల వరకు రానివ్వకుండా ముందుగానే అడ్డుకునేందుకు కారంపూడి పాలిస్తున్న తన సామంతరాజును నాగమ్మ ఎంచుకుంది. కారంపూడిలోనే బ్రహ్మనాయుడిని అంతమొందిస్తానని నాగమ్మ వద్ద ఆ సామంతరాజు మంతనాలు జరిపాడు. పల్నాడు నైసర్గిక స్వరూపాన్ని పరిశీలిస్తే నాగరికల్లు నుంచి ఈశాన్యాన ధరణికోట, దక్షిణాన నాయకురాలు కనుమ, పశ్చిమోత్తరాలుగా ప్రవహిస్తున్న కృష్ణానది,నాగార్జున కొండ లోయలోని విజయపురి వరకు వ్యాపించి ఉంది. మేడపి నుంచి వచ్చే బ్రహ్మన్న సైన్యాన్ని, గురజాల నుంచి వచ్చే నాగమ్మ సైన్యానికి మధ్యలో కారంపూడి రణక్షేత్రంగా నిర్మించటం ఉభయులకు ఆమోదయోగ్యమని యుద్ధ పరిశీలకులు వెలిబుచ్చారు. అత్యంత పవిత్రమైన మహిమాన్విత గంగధార మడుగు ఒడ్డును యుద్ధభూమిగా నిర్ణయం కావటం, తను నిర్మించిన చెన్నకేశవ ఆలయం,తన విజయాన్ని కాంక్షించే అంకాళమ్మ తల్లి కారంపూడిలో కొలువై ఉండటం బ్రహ్మనాయుడుకి అనుకూలించే అంశాలు కావటంతో యుద్ధభూమి కారంపూడి ఎన్నుకోవటానికి ముందుగా సుముఖత వ్యక్తంచేశారు.నాయకురాలు నాగమ్మ పరంగా చూస్తే ఆనాడు కార్యమపూడి పరిసర పరగణాలన్నీ గురజాల నలగామరాజు అధీనంలోనే ఉన్నాయి. చుట్టుపక్కల ఉన్న మండలాధీశులు, సామంతరాజులందరూ అనుకూలంగా ఉండటం నాగమ్మ కారంపూడి వైపే మొగ్గుచూపింది.పల్నాటి యుద్ధం ముగిసింది.యుద్ధంలో చనిపోయిన 66మంది వీర నాయకులకు లింగ ప్రతిష్టచేసి వీరారాధన ఉత్సవాలు జరిపించాలని పిడుగు వంశం వారిని వంశ పారంపార్యంగా ఏర్పరచి జరిగిన నెత్తుటి నేలను చూసి చలించి గుత్తికొండ బిలానికి తపస్సుకి వెళతాడు.అత్యంత రాజ్యకాంక్షతో పల్నాటి యుద్ధానికి రంగంలోకి దిగిన నాగమ్మ యుద్ధానంతరం మనసు మార్చుకొని చేసిన తప్పిదం గుర్తించి ఆధ్యాత్మికంగా దిట్టగామాలపాడులోని శివ క్షేత్రంలోకి పయనించింది. ఇలా జరిగిన పల్నాటి యుద్ధంలో మృతిచెందిన వీరుల ఆత్మలు కార్తీక అమావాస్యనుండి ఐదురోజుల పాటు కారంపూడిలోని మరుభూమిలో అదృశ్యంగా విలపిస్తుంటాయని చరిత్ర తెలుపుతుంది.అందుకే బ్రహ్మనాయుడు కోరిక మేరకు కార్తీక అమావాస్య నుంచి ఐదురోజుల పాటు రాచగావు, రాయభారం, మందపోరు, కోడిపోరు, కళ్లిపాడు పేరుతో వీరారాధన ఉత్సవాలు నిర్వహిస్తుంటారు.

# సాహిత్యంలో పల్నాటి యుద్ధం

ఆంధ్ర ప్రాంతం లోని పల్నాడు ప్రాంతములో 1182వ సంవత్సరంలో జరిగింది. మహాభారతం, పల్నాటి వీరుల చరిత్రకు దగ్గరి పోలికలు ఉండటం చేత దీనిని ఆంధ్ర భారతం అనికూడా అంటారు. పల్నాటి యుద్ధం 12వ శతాబ్దంలో ఆంధ్రదేశంలో రాజకీయ, సాంఘిక, మతమార్పులకు దోహదం చేసిన కీలక యుద్ధం. ఈ యుద్ధం తీరాంధ్రలోని రాజవంశాలన్నింటిని బలహీనపరచి కాకతీయ సామ్రాజ్య విస్తరణకు మార్గం సుగమం చేసింది.1176-1182 మధ్యకాలంలో కారంపూడి వద్ద పల్నాటి యుద్ధం శైవులు, వైష్ణవుల మధ్య జరిగింది. ఇందులో జరిగిన నష్టంవల్ల ఆంధ్ర రాజులందరూ బలహీనులయ్యారు. ఈ పరిస్థితిలో ఓరుగల్లు కాకతీయులు ఇక్కడున్న రాజులందరినీ ఓడించారు. పల్నాటి యుద్ధం ఆంధ్రదేశంలో ఎంతో ప్రాచుర్యం పొందిన యుద్ధం .క్రీడాభిరామంలో పలనాటి యుద్ధ గాథలు పేర్కొనటమే గాక ఓరుగల్లు నగరంలో వీరచరిత్రను గానం చేయటం, అక్కడి యువకులు ప్రేరణ పొందటం, ఓరుగల్లు ఇళ్లలో పలనాటి యుద్ధ చిత్రాలు చిత్రించబడి ఉండటాన్ని వర్ణిస్తుంది.ఈ క్రీడాభిరామానికి మూల సంస్కృత గ్రంథమైన ప్రేమాభిరామాన్ని రావిపాటి త్రిపురాంతకకవి పలనాటి యుద్ధం జరిగిన తరువాత 50-60 సంవత్సరాలకు వ్రాశాడు. పలనాటి యుద్ధంలో ఓడిపోయిన బ్రహ్మనాయుని అనుయాయులు ఓరుగల్లు చేరి కాకతీయుల కొలువులో చేరారు. కనుక ఓరుగల్లులో పలనాటి వీరగాథ బాగా ప్రచారంలోకి వచ్చింది. ఇదే విషయము ప్రేమాభిరామంలో కూడా పేర్కొనబడింది.పల్నాటి వీరుల చరిత్రను తొలిసారి శ్రీనాథుడు మూడు వందల సంవత్సరాల తర్వాత మంజరీ ద్విపద కావ్యముగా రచించాడు. పల్నాటి వీరచరిత్రలో బాలచంద్రుని యుద్ధ ఘట్టం మాత్రమే శ్రీనాథుడు రచించాడని పరిశోధకుల అభిప్రాయం. మిగిలిన కథా భాగాలు కొండయ్య,మల్లయ్య రచించినవి. శ్రీనాథుడు పూర్తి గ్రంథం రచించి ఉంటే అది కాలగర్భములో కలిసిపోయిందేమో తెలియదు. అక్కిరాజు ఉమాకాంతం మొట్టమొదట పల్నాటి వీరచరిత్ర యొక్క ప్రతులు సంపాదించి, సంస్కరించి 1911లో అచ్చువేయించాడు. కొండయ్య, మల్లయ్య రచనలను కూడా చేర్చి, సంపూర్ణ గ్రంథాన్ని సంస్కరించి 1961లో ఆచార్య పింగళి లక్ష్మీకాంతం ప్రచురించాడు.

మద్రాసు ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారంనందు, కాకినాడ ఆంధ్రసాహిత్య పరిషత్ గ్రంథాలయంనందు, గుంటూరు నెల్లూరు మండలంలలో ఉన్న వీరవిద్యావంతు లనబడెడి గాథాకారులకడను పల్నాటి వీరగాథలకు సంబంధించిన తాళపత్రపత్రులు,వ్రాతప్రతులు పెక్కుగలవు. ఇట్టివానిలో అలరాచమల్లుగారి గురజాల రాయబారం అను వీరగాథనుగూర్చి వివరించుచున్నవి. ఈ వీరగాథను గురిజాల రాయబారం అనియు, అలరాజు రాయబారం అను పేరును ఉన్నాయి. పల్నాటి వీరకథాచక్రమును వచ్చు వీరు లందరిలోను అలరాజు మిక్కిలి గొప్పవాడు.ఈగాథలలో పెద్దన్న, బ్రహ్మన్న మున్నగు మహావీరులు సైతము ఇతని తరువాతివారే. కాని ఆంధ్రులు లీతనిని నాగమ్మ విషప్రయోగమ వలన మరణించిన అర్చకునిగా జమకట్టి,బ్రహ్మనాయకునికి లేని ప్రాముఖ్యాన్ని అంటగట్టిరి. ఆతనిని నాగమ్మ పంపిన విషాన్నాన్ని జీర్ణించుకున్న అవతారమూర్తిగా చిత్రించారు.అలరాజు కల్యాణాన్ని ఏలిన వీరసోముని పౌత్రుడు. ఈ వీరసోముడు కాలచుర్య బిజ్జలుని పుత్రుడని చారిత్రకులు భావించుచున్నారు.వీరగాథలలో ఇతడు చోళరాజని ఉంది.కొమ్మరాజు-చల్లమాదేవుల ఏకైక పుత్రుడు.ఇతడు నలగాముని ఏకైక పుత్రికయగు రత్నాల పేరమ్మను వివాహమాడెను. అలరాజు మేనత్త అగు సిరాదేవి




పెదమలి దేవుని భార్య ఇట్లు, అటు నలగామునకును, ఇటు మలిదేవునకును ఆప్తబంధువు అలరాజు.మైలమ దేవికి అరణముగావచ్చిన పల్నాటికి నలగాముడు రాజయ్యెను. పుత్రులులేని ఈ నలగాముని రాజ్యంనకు రత్నాలపేరమ్మ భర్తయగు అలరాజే వారసుడు. ఈచిక్కును గుర్తించియే కాబోలు, నరసింగరాజునకు పట్టంగట్టించిన నాగమ్మ ఇతనిపై విషప్రయోగము చేసింది.అలరాజు మహాశూరుడు.నూర్గురు రాజులను జయించి, రాచమల్లు అను బిరుదును వహించెను. ఈతని ఖడ్గము పేరు సూర్య బేతాళము. ఇతని అశ్వము పేరు సవరాల జిమ్మడు, శివక అశ్వం అని రెండు పేర్లు.ఈ గుర్రం కాలికి అలరాజుచే జయించబడిన నూర్గురు రాజుల బొమ్మలుగల పెండెరముండును.ఈతడే కనుక నాగమ్మ విషప్రయోగముతో గురికాకున్నచో పల్నాటి యుద్ధం అన్ని దినములు జరిగెడిదికాదు! ఒకటి రెండు దినంలలో నలగాముని వీరులందరినీ తుడిచిపెట్టగల సమర్థుడు అలరాజు! అలరాజు నలగామున కల్లుడును, రాచమల్లు బిరుదాంకితుడును అగుటచే ఇతనిని అల్లు మల్లన్న అని ముద్దుగా పిలిచెడివారని తెలుస్తుంది.అలరాచమల్లు మహావీరుడనుటకు మరొక తార్కాణమున్నది.అతడు తన యొరనుండి సూర్య భేతాళమును బయటకు తీసినచో, దానిని ప్రయోగించకుండా వ్యర్థంగా మరల లోపల పెట్టడు.ఇది శూరకులమున గానవచ్చు గొప్పనియమం. అలరాజు పెద్దన్నను ఎదిరించి కంభంపాటి మిట్టలపై పోరునప్పుడు, బ్రహ్మనాయుడు వచ్చి వారి యుద్ధమును ఆపి, అల్లుడా కత్తిని ఒరచెయ్యి అని అలరాజును కోరగా, అలరాజు తన ఖడ్గమన కాహారములేనిదే ఉపసంహారింపజాలనని తెల్పెను. అప్పుడు బ్రహ్మన్నాయుడు అలరాజు సూర్యభేతాళమునకు ఏడు దున్నపోతులు, ఏడు పెద్దగొర్రెలు ఆహుతిగా పెట్టెనని గురిజాల రాయబారం అను వ్రాతప్రతిలో ఉంది. ఇట్లే అలరాజు, నలగాముని కొలువుకూటమునకు పోయినప్పుడు, నాగమ్మ మాటలకు కోపించి కత్తి దూసినాడు. నాగమ్మ భయపడి నలగాముని చాటునకు తప్పుకుంది. నలగామాదులాతనిని శాంతపర్చారు. అలరాజు అంతటితో తనకత్తిని దించలేదు.దాని కాహారము పెట్టికాని ఉపసహిరింపదు కదా! రౌద్రమూర్తియై ఎదురుగా చూచాడు,సభాభవమున స్తంభమును పగలగొట్టాడు.

అలరాజు, నాగమ్మ విషప్రయోగముచే చనిపోవుచు,తన బిరుదులన్నియు బాలచంద్రునికిచ్చెను..ఇంతటి మహావీరుడగు అలరాచమల్లు, పల్నాటి రాజ్యానికి వారసుడనియు, యుద్ధం వచ్చినచో తమ్మునందరును తుడిచిపెట్టునని భయపడి, నలగాముని తరువాత నరసింగరాజును సింహాసనమెక్కింపదలచిన నాగమ్మ ఇతనిని మాయోపాయముచే చంపింది. దీనిని బట్టి అలరాజు మరణంనకు కారణం నాగమ్మయే కారణమని భావించవచ్చును. మరియొక కథ ప్రకారమ ఇందు బ్రహ్మనాయుడు అలరాజుకు పెద్దన్న కలహం కారణంగా అలరాజుపై ద్వేషంతో బ్రహ్మనాయుడే కుట్రపన్ని చంపినాడని గురజాల రాయబారం ఉన్న కథ తెలుపుతుంది.

# పల్నాటి తొలి రాజధాని మాచర్ల

శతాబ్ధాల ఆధ్యాత్మిక, సాంస్కృతిక, సాంఘిక చారిత్రక వైభవాలకు ప్రతీక మాచర్ల. పల్నాటి వీరుల ఆవాస ప్రాంతంగానూ, పల్నాటివీరుల ఆరాధ్యదైవం శ్రీచెన్నకేశవస్వామి కొలువైయున్న క్షేత్రంగానూ రాష్ట్రంలోనే కాక దేశంలోనే పేరుగాంచింది. త్రేతాయుగంలో ఈ ప్రాంతమంతా దండకారణ్యమని, మారీచుడేలిన చోటు మాచెర్లని,ఖరుడేలినది కారంపూడిఅని,దూషణుడేలినచోటు దుర్గి అని అంటారు. క్రీ.శ.1111నాటి మాచర్ల శ్రీలక్ష్మీచెన్నకేశవాలయ ఆవరణలోని ఆదిత్యుని నాగస్తంభ శాసనంలో **"శ్రీమదాతిత్యేన మహాదేవి తాటాకాభిదానాయాం రాజధాన్యాం... పల్లిదేశ శతత్రయాన్తర్వర్తి"** అని ఉండుట వలన 300 గ్రామాల గల పల్నాటి రాజ్యానికి మహాదేవి తటాక(మాచర్ల) రాజధాని అని తెలుస్తుంది. రెంటచింతల మండలం సత్రశాల క్రీ.శ.1103 నాటి మండది రేవినాయకుడి శాసనం ద్వారా పల్నాడు రాజ్య స్థాపన జరిగినట్లు, రాజ్యానికి హైహయ వంశానికి చెందిన చాగిబేతరాజు పాలకుడైనట్లు తెలుస్తుంది. అలా ఏర్పడ్డ పల్నాటి రాజ్యానికి తొలి రాజధాని "మాచర్ల" అని చెన్నకేశవాలయ శాసనం రుజువు చేస్తుంది.

ఆనాడు పరిపాలన సౌలభ్యం కోసం ఏర్పడిన రాష్ట్ర విభాగాలలో అత్యంత ప్రాచీనమైన ప్రాంతం పల్నాడు.12వ శతాబ్దం ఆరంభంలో హైహయువులు పాలకులుగా పల్నాడు ప్రాంతం ఒక రాజ్యంగా అవతరించినది.పల్నాటి రాజ్యానికి తొలిరాజధానిగా ఉన్న మాచర్ల క్రీ.శ. 1129 నాటికి రాజధాని గురజాలకు మారినట్లు గురజాల వీరభద్రస్వామి ఆలయ శాసనం ద్వారా తెలుస్తుంది. క్రీ.శ. 1157 నాటికి పల్నాడు రాజ్యం రెండు సమభాగాలుగా విడిపోయి గురజాల,మాచర్ల రాజ్యాలుగా ఏర్పడినవి. అలా ఏర్పడ్డ మాచర్ల రాజ్యానికి మాచర్ల రాజధానిగా క్రీ.శ.1157 నుండి క్రీ.శ.1182 వరకు కొనసాగింది.మాచర్లకు విష్ణుపురి, మహిష్మతి నగరమని పేర్లు ఉన్నట్లు సాహిత్యంలో ఉండగా, మహాదేవిచెర్ల, మహాదేవితటాకం, మహాదేవిచెరువు, మాచెర్ల, మాచర్ల అని శాసనాల్లో ఉన్నది.

1. క్రీ.శ. 1111 నాటి మాచర్ల చెన్నకేశవాలయం హైహయువుల శాసనంలో **శ్రీమదాతిత్యేన మహాదేవి తాటాకాభిదానాయాం రాజధాన్యాం**
2. క్రీ.శ. 1135 నాటి మాచర్ల త్రిలోచన పల్లవుని శాసనంలో **గ్రహణ నిమిత్తే మహాదేవి తటాకాభ్యిధానపురే త్రిలోచనపల్లవ**
3. క్రీ.శ. 1288 నాటి మాచర్ల కాకతి రుద్రమదేవి శాసనంలో **పల్లినాటిలోని మహాదేవి చెల్ల మూలస్తానం శ్రీరామనాథ-**
4. క్రీ.శ. 1294 నాటి చెర్లగుడిపాడు శాసనంలో **టింగారి కొడ్కులూను ... మాచర్ల అప్పయంగారూను**
5. క్రీ.శ. 1313 నాటి మాచర్ల పోలేరమ్మగుడి కాకతీయుల శాసనంలో **మహాదేవిచఱ్ల గంగాపరమేశ్వర్కి త్రిసంధి ఉపహారం బియ్యం నిత్య మాచెఱ్ల పాటిమానెడు పెసలు.... ధారపోసి యిస్తిమి.**
6. క్రీ.శ.1314 నాటి మాచర్ల వీరులగుడి శాసనంలో **మాచయనాయనింగారి కొడ్కు లు దేవరినాయనింగారు మహాదేవి చెఱువు సుఖానం బాలింపుచూ..**

ఇంకా పలు శాసనాలలో మాచర్ల పేరు కానవస్తుంది. పూర్వం చంద్రవంక పక్కన పెద్ద తటాకం(ప్రస్తుత మాచర్ల పెద్దచెరువు లేదా బ్రహ్మనాయుడు చెరువు) ఉండేది.ఆ చెరువులో బాదామిచాళుక్యుల 7వ శతాబ్ధంనాటి మహాదేవిఆలయం(ప్రస్తుత రూపులమ్మగుడి) ఉన్నది.ఆ మహాదేవి పేరుతోనే మహాదేవి తటాకమని, మహాదేవిచెర్ల అని, మహాదేవి చెఱువుఅని, క్రమంగా మార్పుచెంది మాచెర్ల, మాచర్లగా మారినది.శాసనముల ద్వారా మాచర్ల అనే పదము మహాదేవిచెర్లకి రూపాంతరమని తెలుస్తుంది.మాచర్ల పోలేరమ్మ గుడి శాసనం ద్వారా మహాదేవిచెర్ల అధికార నామముకాగా,మాచర్ల వ్యావహారిక నామముగా నిరూపితమైనది.



**పావులూరి సతీష్‌బాబు,**
**.జర్నలిస్టు,రచయిత,**
**మాచర్ల.**
**8523041222**



**P.CHANDRASEKHAR**
**HAPPY BIRTHDAY**

# పల్నాటి యుద్ధం.... వచన కావ్యం

పల్నాటి యుద్ధం ద్విపద కావ్యాన్ని వచన కావ్యంగా అత్యంత రమణీయంగా రచించిన వారు ఆచార్య యార్లగడ్డ బాల గంగాధరరావు. ఇతని శైలి అత్యంత సులభ గ్రాహ్యంగా ఉండి, చదువరులను కట్టిపడేసేటట్లు ఉంది. కావ్యం చివరన నాలుగు అనుబంధాలను కూడా చేర్చినందున, కావ్యానికి మరింత సొబగును కలిగించింది. ఆ అనుబంధాలు.

1. పలనాటి చరిత్రలో ప్రసక్తులైన వ్యక్తులు, 2. పలనాటి చరిత్రలో ప్రసక్తమైన ప్రదేశాలు,
3. పలనాటి వీర చరిత్రలో ప్రసక్తమైన సామాజిక వర్గాల వివరణ
4. ఈ గ్రంథంలో వాడబడిన జాతీయాలు, సామెతలు పలుకు బళ్ళు.

ఈ గ్రంథాన్ని నిర్మలా పబ్లికేషన్ విజయవాడ వారు ప్రచురించారు. ఈ గ్రంథ స్వీయకర్తలు: శ్రీమతి వి.ఎల్. ఇందిరాదత్తు, శ్రీయుత వి.లక్ష్మణదత్తు దంపతులు.

# మహావీరుడు కన్నమదాసు



సాంప్రదాయాలు స్పష్టంగా తెలియజేస్తున్నాయి. ఈ క్రమంలో కన్నమదాసును బ్రహ్మనాయుడే సైన్యాధ్యక్షునిగా నియమించాడని చెప్పడం వివేకం అనిపించుకోదు..చిన్నప్పటినుండే కన్నమదాసుకు పట్టుదల,వీరత్వం,భయపడని గుణం తల్లి,తండ్రులు నేర్పారని చెపుతారు. పల్నాటి చరిత్ర మనకు మొదటిగా తెలిపిన శ్రీనాథ కవింసార్వభౌమ(ఆయన కాలం 1365-1441) తన పల్నాటి వీరచరిత్ర గ్రంథంలో కన్నమదాసు అరివీర భయంకరుడుని, మహావీరుడని తెలిపారు.ఆ రోజుల్లో కన్నమదాసు ను"కన్నమనీడు", "రాజామాల కన్నమ దాసు" అని, ప్రజలు పిలిచేవారని తెలిపారు.కారంపూడి లో జరిగిన పల్నాటి యుద్ధం, పల్నాటి వీరుల వీరత్వం గురించి వారి తదనంతరం మహాదేవి చర్ల(మాచర్ల), గురజాల,కారంపూడి ప్రజలు బుర్రకథల రూపంలో,కథల రూపంలో చెప్పుకోవటం చూసి అప్పట్లో 15 వ శతాబ్దంలో పల్నాటి ప్రాంతం పక్కనే కొండవీడు రెడ్డి రాజుల వద్ద ఆస్థాన కవి గా ఉన్న శ్రీనాథుడు ఉత్తేజితుడై పల్నాడులో పలు ప్రాంతాలు తిరిగి పల్నాటి చరిత్ర గురించి పరిశోధనలు చేసి **"పల్నాటి వీరచరిత్ర"** గ్రంథం రచించారు.కన్నమదాసు వీరత్వం గురించి చరిత్రకారులు చెప్పిన విశేషాలు కవి శ్రీనాథుని మాటల్లో - కన్నమదాసు కదన రంగంలోకి వస్తే శత్రుసైన్యం లక్షమంది ఉన్న చెమటలు పట్టేవట, యుద్దరంగాన ఆయన గుర్రం పరుగెత్తే గిట్టల శబ్దం కూడా శత్రువులను భయకంపింతులను చేసేది. దేవుడా ఆ మహావీరుడు మా వైపుకాక మరో వైపు వెల్లేలా చూడు అని కోరుకునేవారట. ఈయన కత్తితో చేసే వీరవిహారం చూసే శత్రు రాజులు ఈయనకు ఎదురు కాకుండా తప్పించుకునెడివారట.పల్నాటి యుద్దంలో గొప్పవీరులు,బాలచంద్రుడు లాంటి మహావీరులు మరణించినను,కన్నమదాసు సైన్యాన్ని నడిపించి బ్రహ్మన్న సహకారంతో నాగమ్మను ఓడించి మాచర్లకు విజయాన్ని చేకూర్చాడు.



కన్నమదాసు
"భైరవ ఖడ్గం"

1100 శతాబ్దం లో మాచర్ల సేనలకు సర్వ సైనానిగా భాద్యత నిర్వర్తించి, బ్రహ్మనాయుడికి నమ్మినబంటుగా కడవరకు నిలిచి చరిత్రలో,పల్నాటి ప్రజల గుండెల్లో నేటికి నిలిచిన మహావీరుడు కన్నమదాసు.తల్లి పెమ్మసాని.చాపలమ్మ అనికూడా అంటారు. కన్నమ తండ్రి తెప్పలనీడు.(తెప్పల నాయన్న)

పల్నాటి రాజ్యస్థాపకుడైన అనుగు రాజు ఆస్థానంలో సైన్యాధ్యక్షుడు.ఈయన బ్రహ్మనాయుడి తండ్రి దొడ్డ నాయుడితో పల్నాడుకు వలస వచ్చాడు. కన్నమనీడు తండ్రి తెప్పలనీడు నేతృత్వంలో జరిగిన 'కోరుట్ల' కదనంలో విజయం సొంతమైంది. ఈ యుద్ధమే అనంతరం 'అరణగండ్ల' యుద్ధానికి దారితీసి పల్నాటి రాజ్యస్థాపనకు దోహదం చేసింది. ఆమెను తెప్పలనీడు అరణగండ్ల యుద్ధంలో వీర స్వర్గం పొందాడు..



కారంపూడిలో కన్నమదాసు మేడ

చాలా మంది కన్నమదాసుని, బ్రహ్మనాయుడు ఏదో దయతలచి పదవి ఇచ్చాడని చెబుతారు. కానీ అది నిజంకాదు.అనుగురాజు మరణానంతరం ఆయన తొలి పురుష సంతానం నలగామ రాజుకు సింహాసనం దక్కినట్లు, దొడ్డనాయుని మరణం తర్వాత ఆయన కుమారుడు బ్రహ్మనాయుడికి మంత్రి పదవి లభించినట్లు, తెప్పలనీడి సైన్యాధ్యక్ష పదవి ఆయన పుత్రుడైన కన్నమదాసుకు దక్కాలని, పరంపర హక్కుగా రాచరిక

# పల్నాటి మాల కన్నమదాసు చరిత్ర

## పల్నాటి చరిత్ర తెలుగులో తొలి వీరగాథ.

**ఆచార్య యార్లగడ్డ** మాటల్లో – కన్నమదాసు రాజాజ్ఞ ను పాటించటంలో గొప్ప విధేయుడని,అత్యంత సమయస్ఫూర్తిగలవాడని అనేక క్లిష్ట సమయాల్లో చతురతతో వ్యవహరించి మాచర్ల పాలకులను కాపాడారని ఆచార్య యార్లగడ్డ బాలగంగాధరరావు గారు రాసిన "పల్నాటి వీరచరిత్ర పుస్తకం" లో కన్నమదాసును వర్ణించారు.**విదేశీ పరిశోధకులు రోగర్** మాటల్లో – కన్నమదాసు వాడిన ఆయుధాలు ఇతర ఏ వీరులు వాడలేదని ఆయన చేతిలో భయంకర ఖడ్గం ఉండేదని,దాని బరువు అధికమని,ఆయనను దగ్గర నుండి చూస్తేనే శత్రువులకు పై ప్రాణాలు, పైనే పోయేవని పల్నాటి చరిత్ర పై పరిశోధనచేసి **"ఎథిక్ ఆఫ్ పల్నాడు"** అనే పరిశోధన గ్రందాన్ని రచించిన రోగోర్ అనే విదేశీ చరిత్ర కారుడు తెలిపారు...

అలాగే బ్రహ్మన్న కు శత్రువుల నుండి కలిగే ముప్పును కూడా అనుక్షణం గమనిస్తూ కంటికి రెప్పలా కాపాడేవాడని,కన్నమదాసు పక్కన ఉండగా బ్రహ్మనాయుడుని ఎవరు ఏమిచేయలేరనే నానుడి అప్పట్లో ఉండేదని తెలిపాడు.పల్నాటి చరిత్ర తెలుగులో తొలి వీరగాథ.ఈ గాథను బ్రహ్మనాయుడి పక్షాన కారంపూడి కథలని,,, నాయకురాలు నాగమ్మ పక్షాన గురజాల కథల నామంతో పిచ్చుకుంట్లవారు. శతాబ్దాలుగా గానం చేస్తూ వచ్చారు. ఈ కథాగానం ఆయా కుటుంబాలలో వంశపారంపర్యంగా తరతరాలుగా కొనసాగుతూనే వుంది.పల్నాడులో ప్రతీ సంవత్సరం జరిగే ఉత్సవంలో,, వీరగాథలు చెబుతూ ప్రచారం చేసే బాధ్యత తీసుకున్నవారిని "వీర విద్యావంతులు" అంటారు.ఇది పారంపర్య హక్కుగా మాల కన్నమదాసు కులానికి చెందిన మాల వారికి ఇవ్వబడింది.పల్నాటి వీర గాథల్ని ప్రచారం చేయడానికి బ్రహ్మనాయుడు, మాలలే ఆదేశించాడనే కథ ప్రచారంలో వుంది.ఇందుకోసం పల్నాడు వీరాచారపీఠం ఏర్పాటు చేయబడింది.అందుకు పీఠాధిపతులుగా మాలలను మాత్రమే నియమించే సాంప్రదాయం ఉంది.ఈ మాల వీరవిద్యావంతులే గతించిన చరిత్రలో కాకతీయుల కాలంలో ఓరుగల్లు వీధుల్లో పల్నాటి వీర గాథల్ని చెప్పినట్లు, వారు పయోగించిన వాయిద్యాలను గురించీ,వాటి ఉధృత ధ్వనులను కూర్చీ "క్రీడాభిరామం" లో చెప్పబడింది. పల్నాడులో కన్నమదాసు వాడిన ఖడ్గాన్ని, "భైరవ ఖడ్గం"అంటారు. అది ఇప్పటికి కూడా పరిరక్షణలో కారెంపూడి నాగులేరు ఒడ్డున, వీరులగుడిలో ఉంది.

"మాలలకు బుట్టి
మాలనైపోక
విష్ణు పాదముబట్టి విశ్వంబులోన
తెప్పులి నాయుడు తెరవైనట్టి
వికబాబ్జ లోచన పెమ్మ సానికిని
శ్రీమించు చెన్నుని మేన
పెంపొందు తులసి పెదవనమాల
వరమున గన్నట్టి వరపుణ్యసుతుడ
కన్నమ నాపేరు కమలాక్షి వినవె"

పల్నాటి వీరచరిత్ర –పింగళి లక్ష్మీకాంతం– కల్లు ప్రతిష్ట –పుట: 307

# పలనాటి వీరుడు  బాలచంద్రుడు

పల్నాటి యుద్ధంలోఅసువులు బాసిన అందగాడు బాలచంద్రుడు. బ్రహ్మనాయుడి భార్య ఐతాంబ. వారికి చాలా కాలం పిల్లల్లేరు. ఎన్నెన్నో నోములు, నోచారు. అలా లేకలేక పుట్టినవాడు బాల చంద్రుడు. అప్పట్లో ఈ కుటుంబం ఉండేది నేటి ప్రకాశం జిల్లా మేడపి ప్రాంతం. బాలచంద్రుడికి అయిదేళ్లుండగా.. ఒకసారి జాతకాలు చూపించారు. ఈ పిల్లాడి వల్ల తండ్రికి మృత్యుగండం అని తేల్చేశారు జ్యోతిష్యులు.

బెంబేలెత్తి పోయాడు బ్రహ్మనాయుడు. కన్నబంధం కన్నా తన ప్రాణ భయం మిన్న. తన కుడి భుజం కన్నమదాసుని పిలిచాడు.కన్న కొడుకునే చంపేయమన్నాడు. కానీ కన్నమదాసుకి మనసొప్పలేదు. పాలబుగ్గల చంటి పిల్లాణ్ణి చూస్తూ చూస్తూ ఎలా వధించడం?అందుకే ఆ బాలుడిని బ్రహ్మనాయుడి తమ్ముడు పేరినాయుడి ఇంట ఉంచాడు.అక్కడే పెరిగి పెద్దవాడయ్యాడు.యుద్ధనీతి, అస్త్రశస్త్ర విన్యాసం, విలువిద్య, గుర్రపుస్వారీ అన్నీ నేర్చుకున్నాడు.ఇంతలో పెళ్లీడుకొచ్చాడు బాలచంద్రుడు.

మాచర్లలో గండు కన్నమనాయుడు అనే ధనవంతుడు ఉన్నాడు. ఆయన కూతురు మాంచాల. పెళ్లీడుకొచ్చింది.ఆ విషయం కన్నమదాసుకి తెలిసింది. ఓ రోజు బ్రహ్మనాయుడి కొలువుకి రమ్మని కన్నమనాయుడికి, దాసు సలహా ఇచ్చాడు.మరోవైపు అక్కడే నూనుగు మీసాల నూత్న యవ్వనుడు బాలచంద్రుడిని ప్రవేశ పెట్టాడు.ఎవరా అని అంతా ఆశ్చర్యపోయారు. జరిగిందంతా అరక్షణంలో చెప్పాడు కన్నమదాసు.కోపంతో బ్రహ్మనాయుడు ఊగిపోయాడు.అంతా సర్ది చెప్పారు.అయ్యిందేదో మంచికే కదా అన్నారు. ఆపై మాంచాల, బాలచంద్రుడి పెళ్లి జరిగింది. అంతలో పలనాటి యుద్ధం వచ్చింది. బ్రహ్మనాయుడు కారెంపూడి వెళ్లాడు కదనానికి. రాణి వాసానికి రక్షకుడిగా బాలచంద్రుడిని నియమించారు. తానూ యుద్ధానికి వెళ్లాలని ఉత్సాహపడ్డాడు. కానీ లాభం లేకపోయింది.

కాలక్షేపం కోసం– అనపోతు, బోర్నీడు, చంద్రన్న, మంచన్న, తేర్కొడు లాంటి స్నేహితులతో గడిపేవాడు. గుమ్మడికాయలాట, చెరకు పందాల ఆట ఆడేవారు. ఓరోజు బొంగరాలాటకి సిద్ధమయ్యారు. అంతా మొల్లరావి చెట్టు దగ్గర గుమిగూడారు ఆడడానికి. ఆడామగా, ఆబాలగోపాలమూ తరలివచ్చారు చూడడానికి. గాల్లోకి విసిరాడు. అది వెళ్లి,వెళ్లి చట్రాతిని తాకి– పైకెళ్లి– సర్రున కిందకిదిగి– అన్నమ్మ అనే స్త్రీ కాలికి తగిలింది. ఆమె మూర్ఛపోయింది.బాలచంద్రుడు కంగారుగా ఆమె దగ్గరికి వెళ్లాడు. సపర్యలు చేశాడు. తన పచ్చవన్నెల పట్టు వస్త్రాల్ని చింపి ఆమె కాలుకి కట్టాడు. కొంతసేపటికి ఆమె తేరుకొని కనులు తెరిచింది. కానీ ఏమీ అర్థం కాక– బాలచంద్రుడిని తిట్టింది– **“నీ తండ్రి కారంపూడి పోరుకి వెళితే ఇక్కడ నీకు బొంగరాలాటా? కాంతలయెడ ఇంత పొగరా? సిగ్గులేదా?”** అని నోరు పారేసుకొంది.ఆ పలుకులు ములుకుల్లా గుచ్చుకొన్నాయి బాలచంద్రుడికి.నేరుగా తల్లి దగ్గరకు వెళ్లాడు.తానూ యుద్ధానికి వెళ్తానన్నాడు. ఆమె ససేమిరా అంది.“భయపడుతున్నావా అమ్మా. మరి నేను నేర్చుకున్న యుద్ధ విద్యలు దేనికి?” అని ప్రశ్నించాడు. ఐతాంబకి అర్థమైంది. ఇక అతడిని ఆపలేమని. అందుకే భార్య మాంచాలకి చెప్పి యుద్ధానికి వెళ్లమంది. అందుకోసం మాచర్లకి పయనమవమంది. ఆలిని చూస్తే ఆవేశం తగ్గి మెత్తపడతాడేమోనన్నది ఆమె ఆశ. అతడు అత్తారింటికి వెళ్లే లోపు– బాలచంద్రుడి మనసుని మార్చమని– కోడలు మాంచాలకి కబురంపింది ఐతాంబ.

ఎదురుగా బాలచంద్రుడు. చాన్నాళ్లకి వచ్చిన ప్రాణకాంతుడు. మాంచాల సంబరపడిపోయింది. అంతలోనే నిరుత్సాహం. మనోనాథుడిని సమరానికి పంపాలా? వీర గంధం తెచ్చి వీరుడిగా సాగనంపాలా? పిరికితనం నూరిపోయాలా? సతమతమైంది మాంచాల. అత్తగారి మాట ఒకవైపు. భర్త పోరాటం మరోవైపు తేల్చుకోలేక పోయింది.

వెంటనే తల్లి రేఖాంబ దగ్గరకి వెళ్లింది. ఏది ధర్మమో చెప్పమంది. “యుద్ధం చెయ్యడం మానవ కర్తవ్యం. ప్రాణాలు ఇక్కడ శాశ్వతం కాదు. మరణం ఎప్పుడూ పొంచి ఉంటుంది. దానిని తప్పించే శక్తి ఎవరికీ లేదు.

భావి మానవుల హృద్భవనాలలో నీ భర్త స్ఫూర్తిని నింపు. ఈ మాటలు బలంగా పనిచేశాయి మాంచాలపై.చిరునవ్వు వెలసింది బాలచంద్రుడి పెదాలపై.నిర్మలత్వం వెల్లివిరిసింది మాంచాల మోముపై.ఆమె వీరాంగనయ్నె బాలచంద్రుడికి శౌర్యతిలకం దిద్ది సమరానికి సాగనంపింది.యుద్ధంలో బాలచంద్రుడు మరణించి ఉండొచ్చు. కానీ పౌరుషంతో పోరాడి నేటికీ జీవించి ఉన్నాడు.

# మగువ మాంచాల

బ్రహ్మనాయుడు కొడుకైన బాలచంద్రుడు యొక్క భార్య.గండు కన్నమ, రేఖాంబ లకు మాంచాల జన్మించింది. ఆరేళ్ళ వయసులోనే ఏడేళ్ళ వయసున్న బాలచంద్రుడితో వివాహం జరిగింది.బాలచంద్రుడికి సబ్బాయి అనే వేశ్యతో సంబంధం ఉండేది. ఆ విషయం తెలిసినా కూడా మాంచాల భర్త అనురాగంకోసం ఎదురుచూస్తుండేది. పల్నాటి యుద్ధం (నాగమ్మ నాయకత్వంలో నలగామరాజు సైన్యనాకి, బ్రహ్మనాయుని ఆధ్వర్యంలో మలిదేవరాజు సైన్యానికి కార్యంపూడి వద్ద జరిగిన యుద్ధం) కు బయలుదేరుతున్న తన భర్తను ఆపడానికి ప్రయత్నించింది. చివరకు ఒప్పుకొని, యుద్ధానికి పంపించింది. ఆ యుద్ధంలో బాలచంద్రుడు మరణించాడు. భర్త మరణవార్త విన్న మాంచాల తాను వీరపత్నినయ్యానని సంతోషించింది.

# నాయకురాలు నాగమ్మ

శ్రీనాథుడి పలనాటి చరిత్ర ప్రకారం నాగమ్మ తండ్రి పేరు జగ్గారెడ్డిగా తెలుస్తున్నది. 14 -15 శతాబ్దాల్లో జీవించిన శ్రీనాథుడు కంటే రెండు మూడు వందల సంవత్సరాలు ముందుగా జీవించింది నాగమ్మ. కాబట్టి ఆమె గురించిన శిథిల ఆనవాళ్లను శ్రీనాథుడు దర్శించే అవకాశం ఉన్నది. ఈ క్రమంలో ఊహలకు అవకాశం లేకుండా చరిత్ర రచింపబడుతుంది . అందుకే నాగమ్మ గురించి ఎవ్వరు ఎన్ని రచనలు చేసినా, వారందరు కూడా శ్రీనాథుడి పలనాటి చరిత్రను తిరగేసినవారే !నాగమ్మ పౌరుషాన్ని ధీశక్తిని నాయకత్వ లక్షణాలని పరిశోధకులు సులువుగా వదిలిపెట్టలేదు. ఒక సామాన్య స్త్రీని బుసలు కొట్టిస్తున్న రాజరికపు పోకడలకు కారణాలు అన్వేషించారు.. ఈ ప్రకారం నాగమ్మ తండ్రి జగ్గారెడ్డి మూలాలను పరిశోధించారు. ఆసక్తికరమైన అంశాలను వెల్లడించారుఈ క్రమంలో - జగ్గారెడ్డి ఎవ్వరో కాదు పొలవాస రాజు రెండవ మేదరాజు కుమారుడు రెండవ జగ్గదేవుడుగా అంచనాకు వచ్చారు. చరిత్ర ప్రకారం కాకతీయ రాజు మొదటి ప్రతాపరుద్రుడుగా పిలవబడే రుద్రదేవుడు ( క్రీ. శ. 1158-1195) చేతిలో క్రీ.శ. 1159లో జగ్గదేవుడు ఓడిపోతాడు. ఓటమి తర్వాత జగ్గదేవుడు తనను తాను కాపాడుకునే ప్రయత్నంలో భాగంగా తనను శత్రురాజులు ఎవ్వరూ గుర్తు పట్టకుండా అజ్ఞాతం వహిస్తూ తన పేరును జగ్గారెడ్డిగా మార్చుకుని ఉంటాడు అని ప్రాథమికంగా పేర్కొన్నారు.

**చరిత్రలోకి వెళ్తే...** పొలవాస రాజు రెండవ మేదరాజుకు కాకతీయులకు మధ్య రాజ్యాభావంలో భాగంగా శత్రుభావం ఉంటుంది. అందుకే మేదరాజు అతడి కుమారుడు రెండవ జగ్గదేవుడుతో కలిసి, కరీంనగర్ దగ్గర నగునూరు ప్రభువు దొమ్మరాజు మైళిగితో చేతులు కలుపుతాడు. ఇరువురు కూటమిగా ఏర్పడి కాకతీయ రుద్రుడిపై దండెత్తుతారు. యుద్ధంలో రుద్రుడు గెలిచి, వారి రాజ్యాలను తన రాజ్యంలో కలుపుకుంటాడు.తర్వాత మైళిగిని రుద్రుడు కటకం వరకు వెళ్తాడు. ఇక పొలవాస రాజుల పరిస్థితి ఓటమిభారం వహించి ఉన్న నేపథ్యంలో జీవిత స్వరూపం మార్చుకుని ఉన్నారు అనేది పరిశోధకుల భావన.కాకతీయ యువరాజు ప్రోలరాజు (1052 -1076 ) ను కూడా ఒక శాసనం లో "ప్రోలారెడ్డి" అని పిలుస్తారు. కాకతీయులు స్వతంత్ర పాలకులుగా మారిన తరువాత, వారి పాలనలో ఉన్న వివిధ అధికారులకు ముఖ్యలకు రెడ్డి అనే బిరుదును ఉపయోగించినట్లు తెలుస్తున్నది.ఈ క్రమంలో రెడ్డి పదం పాలనకు పర్యాయపదం గా అర్థమౌతున్న సందర్భంలో జగ్గదేవుడు కూడా తన పేరుని పాలనను సూచించే క్రమంలోకి మార్చుకుని ఉంటాడు అనేది పరిశోధకుల వాదన. ఎందుకంటే.... సామాన్యులుగా రెడ్లు బతుకుతున్న సమాజం అప్పటికి లేదు.

చరిత్రకారుల అంచనా ప్రకారం నాగమ్మ 1155 - 60 ప్రాంతంలో




జన్మించింది.

యుద్ధం నాటికి ఆమె వయసు 25-30 ఉన్నది.అపారమైన ఆస్తి జన నష్టం కలిగించిన పల్నాటి యుద్ధానికి కారణం ఏమిటీ? చరిత్రకారులు ఎన్ని రకాల కారణాలు రాసినా, జానపద గాథలు ఎన్ని కారణాలను ఊహించినా, ప్రధాన మూలం మాత్రం పంటలతో ముడిపడి ఉన్నది అని అనుగురాజు పూర్వ చరిత్ర ద్వారా తెలుస్తుంది. కాగా నాగమ్మ అనుగురాజు కుమారుడు నలగామరాజు కొలువులో మంత్రిగా పనిచేసింది.

**కారణాలు - ప్రచారంలో ఉన్న గాథలు -**

1)అనుగురాజు తన రాజ్యంలో పశువులకు పశుగ్రాసం చొప్ప అవసరం అవుతుంది. ఈ క్రమంలో సేనాపతి తెప్పలినాయుడును అనుగురాజు ఆదేశిస్తాడు. అప్పుడు తెప్పలినాయుడు తన ఆధ్వర్యంలో సైనికులను నేటి కరీంనగర్ ఉత్తర ప్రాంతానికి పంపిస్తాడు. కరీంనగర్ కు 20 కిలోమీటర్ల దూరంలో ఉన్న ప్రాంతంలో జొన్నచొప్ప ఎక్కువగా దొరికేది.ఒక పంటరెడ్డితో తెప్పలినాయుడు తమకు కావలసిన పశుగ్రాసాన్ని సేకరించుకుంటాడు. అది జొన్నచొప్ప. కంకులతో ఆరోగ్యంగా పుష్టిగా ఉంటుంది. అదిచూసి తెప్పలినాయుడు ఆ జొన్నపంటను పశుగ్రాసం కోసం తమ ప్రాంతంలో పండించుకోవాలి అనుకుంటాడు. అందుకే ఆ పంటరెడ్డిని పంటకోసం గింజలు అడుగుతాడు.కానీ పంటరెడ్డి నిరాకరిస్తాడు. అందుకు తెప్పలినాయుడుకు కోపం వస్తుంది.ముఖ్యంగా ఆ పంటరెడ్డి ఎవ్వరో కాదు, ఊరకోట ప్రభువు పేరమరాజుకు దగ్గరి బంధువు.

ఇట్లా జొన్న గింజల గొడవరాజ్యాల మధ్య చిచ్చు పెడ్తుంది. చివరకు చొప్పకోసం ఆరంభమైన ద్వేషం యుద్ధానికి దారి తీస్తుంది.అనుగురాజు సైన్యానికి పేరమరాజు సైన్యానికి మధ్య భీకరయుద్ధం ఆరణిగండ్ల ప్రాంతంలో మొదలవుతుంది.ఈ ఆరణిగండ్లనే నేడు ఆర్నగొండ అని పిలుస్తున్నారు.అట్లాగే ఆనాడు చొప్పదండిగా దొరికే ప్రాంతం నేడు చొప్పదండిగా పిలువబడుతుంది. చొప్పదండికి ఐదు కిలోమీటర్ల దూరంలో ఆర్నగొండ ఉంది.ఈ యుద్ధంలో పేరమరాజు చనిపోయాడు. ఈ పేరమరాజు, పంటరెడ్డి, ఇద్దరూ నాగమ్మకు బంధువులు. అందుకే తెప్పలి నాయుడు మీద నాగమ్మ కోపంతో రగిలిపోతుంది.పేరమరాజు వీర మరణం పొందిన కొన్నాళ్ళకు అతని కుమారుడు ఉత్తురుడు పాలనకు వస్తాడు. ప్రతీకార ద్వేషంతో ఉన్న ఉత్తరుడు తన సానుకూల రాజ్యాల పాలకులతో మంతనాలు జరిపి కూటమిగా ఏర్పడుతాడు.

అనువైన సమయం చూసి అనుగురాజు మీద యుద్ధం ప్రకటిస్తాడు.. మళ్ళీ యుద్ధం ఆరణిగండ్లలోనే జరుగుతుంది. అనుగురాజు తరపున బ్రహ్మనాయుడు యుద్ధానికి వస్తాడు. బ్రహ్మనాయుడి చేతిలో ఉత్తరుడుతో సహా వీరులు అందరూ ఓడిపోయి కప్పం కట్టడానికి ఒప్పుకున్నారు.ఈ యుద్ధంలో ఇరువైపుల ప్రాణ నష్టం జరుగుతుంది. కాగా ఉత్తరుడి తరుపున మరణించిన వీరుల్లో నాగమ్మ భర్త సింగారెడ్డి కూడా ఉన్నాడు. . అప్పటికి నాగమ్మ వివాహం జరిగి రెండు మూడు రోజులే అవుతుంది. కాబట్టి ఈ ఘోరానికి కారణమైన బ్రహ్మనాయుడి మీద నాగమ్మకు ప్రతీకార ద్వేషం పెరుగుతుంది.

2) నాగమ్మ తండ్రి జగ్గారెడ్డి పంటభూమిలో బ్రహ్మనాయుడు చెరువు తవ్వించే ప్రయత్నం చేస్తాడు. అందుకు జగ్గారెడ్డి వ్యతిరేకిస్తాడు. తనకు అడ్డుతగిలిన జగ్గారెడ్డిని బ్రహ్మనాయుడు చంపిస్తాడు. అందుకే బ్రహ్మనాయుడిపై నాగమ్మకు ద్వేషం పుట్టి భవిష్యత్తు కాలంలో యుద్ధానికి దారితీసింది.

3) వెలమ తెగకు చెందిన బ్రహ్మనాయుడు జనాల్లో వైష్ణవాన్ని ప్రచారం చేయడం మొదలెట్టాడు. వెలమల్ని ప్రోత్సహించడం మొదలెట్టాడు. ఇందుకు వ్యతిరేకంగా నాగమ్మ వీరశైవాన్ని ప్రచారం చేస్తూ రెడ్డి కులస్థులను బలపర్చింది. ఈ కారణాల నేపథ్యంలోనే విద్వేషాలు ముదిరి పల్నాటియుద్ధం జరిగింది అని చరిత్రకారులు నమ్ముతున్నారు.

**కట్టించినది కోట గడ్డలకెదురుగా జంగమ వృద్ధుల సత్రశాల. సృష్టించినది వీరశివభక్తులకుగాను స్థావరమ్మున యందు శైవవీధి"** అంటూ

కవిబ్రహ్మ ఏటుకూరి వారి పద్యం గమనిస్తే నాగమ్మ వీర శైవమతాన్ని పోషించినట్టుగా స్పష్టంగా అర్థం అవుతున్నది.నాగమ్మ తన చివరిరోజుల్లో సొంత గ్రామం ఆరవెల్లికి వచ్చి ప్రజల యోగక్షేమాల సాధనకై కృషి చేసిందని ఇదివరకే తెలిసింది. అట్లాగే తనను శక్తివంతంగా నిలబెట్టి చూపెట్టిన పలనాడు ప్రాంతంలో కూడా ఆమె తన సేవలని కొనసాగించింది.నాగమ్మ సేవలకు పౌరుషానికి ప్రతీకగా దాచేపల్లిలో ఆమె విగ్రహం ఉంది.గామాలపాడులో నాగమ్మ భక్తుల కోసం శివాలయం నిర్మించింది.గురజాలలో దూబ చెరువు తవ్వించింది.వాగులపై వంతెనలు నిర్మించిందిఈ ఉదారత నేపథ్యంలో సాహిత్యకారులు నాగమ్మను ప్రశంసిస్తూ తమ రచనలు కొనసాగించారు.**"నాగమ్మ శాంతిదూత"** అని వై . హెచ్.కె. మోహన్రావు, **"కాలమా ! మాదు నాయకురాలి వంటి బిడ్డనే దేశమందైన బెంచినావే** అంటూ మన రాయప్రోలు వారు మురిసిపోయారు .చిలుకూరి వీరభద్రరావు రచించిన "నాయకురాలి దర్పము " లో యుద్ధం చివరిఘట్టం కళ్ళకు కట్టినట్టుగా చిత్రించబడింది.ఆ వివరణ ప్రకారం....యుద్ధంలో యోధులందరు వీరస్వర్గం పొందుతారు. బ్రహ్మనాయుడు – నాయకురాలు నాగమ్మ ఇద్దరూ మిగిలిఉంటారు. ఇరువురు మధ్య యుద్ధం కొనసాగుతుంటుంది. అప్పుడు మాచర్ల రాజు మలిదేవుడు బ్రహ్మనాయునితో చేరి నాయకురాలిని ఎదిరిస్తాడు.

వీరావేశంతో ఉన్న నాయకురాలు మలిదేవుడిమీద ఆగ్రహంతో రెచ్చిపోతుంది. బాణము సంధించి మలిదేవుని శిరస్సును ఖండిస్తుంది. అదిచూసి బ్రహ్మనాయుడు ఒక్కసారిగా స్తంభించిపోతాడు.నాగమ్మ శక్తికి నిశ్చేష్టుడు అవుతాడు. ఆమెలో స్వయంగా విజయలక్ష్మిని దర్శిస్తూ తన ఆయుధాలను కింద పడవేసి నిరాయుధుడై నాయకురాలిని సమీపిస్తాడు " నా శిరస్సు కూడా ఖండించుము " అని తలవంచి నిలబడుతాడు.

అది చూసి నాయకురాలు నాగమ్మ తెల్లబోతుంది. మహా విష్ణు భక్తుడైన బ్రహ్మనాయుడికి తాను కూడా నమస్కరిస్తూ" ఇదంతా కాలవశమున జరిగినది .నేనే ఓడిపోయాను నన్ను క్షమిస్తూ నా శిరస్సు ఖండించుము. నలగామరాజుకు మహామంత్రివై కీర్తి గాంచుము " అంటూ తాను కూడా ఆయుధాలు వదిలిపెడ్తుంది.

అప్పుడు బ్రహ్మనాయుడు యుద్ధనీతిని వదిలి ధర్మనీతికి కట్టుబడుతూ " నిరాయుధురాలైన స్త్రీని సంహరించలేను. విజయము తమరిదే ! పల్నాటిని పాలించగల సమర్థత సామర్థ్యము మీకే ఉన్నది " అని పలుకుతాడు.అంతలోనే –నలగామరాజు అక్కడికి చేరుకుంటాడు. ఇద్దరికి నమస్కరిస్తాడు. తర్వాత ఇద్దరినీ రాజ మర్యాద ప్రకారం ఏనుగుల మీద కూర్చుండ బెట్టుకుని రణరంగము నుండి రాజధాని చేరుకుంటాడు.

మొత్తానికి కొందరు చరిత్ర కారులు పేర్కొన్నట్టు నాగమ్మ వంచకురాలు కాదు అనేది వాస్తవం.ఆమె రాజరికపు హోదాలో పన్నిన పన్నాగాలు రాజతంత్రం మాత్రమే !

**శ్రీనాథుడి 'పలనాటి వీరచరిత్ర' కావ్యమే చరిత్రపై తొట్టతొలి రచన,**

ఆయన గ్రంథమే ప్రామాణికమని స్పష్టమౌతుంది. అయితే శ్రీనాథుని పలనాటి వీరచరిత్రలోని 'కల్లిపోరు', 'బాలచంద్ర యుద్ధం' ఖండికలు మాత్రమే మనకు లభ్యమయ్యాయి. ఈ రెండు ఖండికలలోనే నాయకురాలి రాజనీతి, మానవతా ధోరణి, బ్రహ్మనాయుని రణదాహం, కుట్రపూరిత స్వభావం, బాలచంద్రుని శౌర్యం, దుందుడుకు పోకడలు మనకు తేటతెల్లమౌతాయి. అయితే ఈ ప్రామాణిక అంశాలను వదిలి నాయకురాలినే దుష్టురాలిగా మలిచారు. నిజానికి అపారమైన తన సేనావాహినితో కారంపూడి రణభూమికి చేరుకున్న అనంతరం తనంత

తానుగా సుహృద్భావ ఆలోచన చేసిన నాయకురాలు నలుగామిని ఒప్పించి సంధి ఒడంబడికకు శ్రీకారం చుట్టింది. తనకు అత్యంత ఆప్తులైన వారిని రాయబారులుగా సంధి కార్యక్రమం చక్కబెట్టుకురమ్మని బ్రహ్మనాయుడి శ్రేణుల వద్దకు పంపింది. బ్రహ్మనాయుడి వర్గీయుల గొంతెమ్మ కోర్కెలన్నీ అంగీకరించింది. వారిని సంతృప్తి పరిచి సంధి మార్గాన్ని సుగమం చేసుకుంది. ఈ సంఘటనా సారాన్ని శ్రీనాథుడు తన 'పలనాటి వీరచరిత్ర'లో అక్షరబద్ధం చేశారు.

**'తలపోసి మదిలోన తగిన వారలను**
**వాసిగా బ్రహ్మన్న వద్దకు బంపి**
**బవరంబు గాకుండా పట్టుటకార్య**
**మని పెద్దలనదగు ఆప్తవర్గమును**
**కొండ అన్నమరాజు కోటకేతుండు**
**కూరిమి హితుడు మాడ్గుల వీరరెడ్డి**
**పరమాప్తుడౌ చింతమల్లి రెడ్డియును**
**మొదలైన సువిచార ముఖ్యులైనట్టి**
**చనపర్ల బిలిపించి నదుబుద్ధిననియె**
**బహుపరాక్రమ ప్రాభవులైన**
**వీరులు రాజులు వెలియశోభిల్లు**
**కొలువులులోనికి పోయి కూరిమి మీర**
**సవరంబు గాకుండి సంధిచినట్లు**
**మాటాడి ఆటమీద మాచర్ల భాగ**
**మేలుకొమ్మని చెప్పు మింకొక మాట**
**నాయుని వద్దకు నరసింగుదెచ్చి**
**కులవైరమడతుము కోరిమీరంద**
**రొక్కటి కమ్మని యొప్పించిరండు'.**

ఈ మొత్తం ద్విపదలో బ్రహ్మనాయుడి పక్షం వారి మాచర్ల రాజ్యాన్ని వారికే ఇచ్చివేస్తామని, మరింకనూ అలరాజు హంతుకుడని అభియోగాన్ని ఎదుర్కొంటున్న నరసింగరాజును కూడా అప్పగించుతామని నాయకురాలు సంధి అంశాలుగా ప్రతిపాదించిన వైనం మనకు బోధపడుతుంది.

ఆరు సంవత్సరాల పాటు పల్నాడుతో పాటు పలనాటి చరిత్రకు అనవాళ్ళు దొరికే ఇతరేతర ప్రాంతాలలో సంచరించి



దాచేపల్లి మండలం గామాలపాడు లో పల్నాటి నాగమ్మ నిర్మించిన శివాలయం

THE EPIC OF PALNADU అను మకుటంతో పలనాటి వీర చరిత్రను వెలువరించిన అమెరికన్ పరిశోధకుడు H.Roghair కూడా యుద్ధపరిణామాలను విశదీకరిస్తూ 'యుద్ధం చేయలేమంటూ, యుద్ధానికి కారణం లేదంటూ బ్రహ్మన్న వర్గీయులు గోసంగులు (మాదిగలు/దళితులు) యుద్ధ భూమిని విడిచివెళ్ళిన వైనాన్ని తెలియజేశార'ని అన్నారు. నాయకురాలి పక్షానే ధర్మం ఉందన్న గోసంగుల నిర్ణయం ఆమె నిబద్ధతను, చిత్తశుద్ధిని నిరూపిస్తున్నాయి.యుద్ధరహిత పల్నాడు కోసం నాయకురాలు చూపిన చొరవ, తపన, స్పష్టంగా But the Gosangis saw no reason for the war, and they turned back. Each man went to his own place. After they were gone, repeatedly messages were sent to them, asking them to come back. But when the messengers came, the Gosangis said that they would not come. The Gosangis were the first followers of the creed Brahma Naidu. (THE EPIC OF PALNADU) ఆక్స్ఫర్డ్ యూనివర్సిటీ ప్రెస్ ప్రచురించింది.నాయకురాలిని,ఆమె నీతిమంతమైన జీవన గమనాన్ని, అజేయమైన ఆమె ధీరత్వాన్ని తెలుగు సమాజమంతా నిజాయితీగా అర్థం చేసుకోవాలి.

**.హెచ్.కె.మోహనరావు,అధ్యక్షులు,**

**పల్నాడు రచయితల సంఘం.**





# మహామంత్రి. బ్రహ్మనాయుడు



బ్రహ్మనాయని తల్లి శీలమ్మ, తండ్రి దొడ్డనాయుడు, భార్య ఐతాంబ, కుమారుడు బాలచంద్రుడు. వైష్ణవ ఆచార్యులైన పన్నిద్దరాళ్వారులు ముఖ్యంగా రామానుజాచార్యులు మొదలైనవారు ఈతన్ని ప్రభావితం చేశారు. తల్లిదండ్రుల శిక్షణ సత్యవర్తనకు దోహదం చేస్తే రామానుజాచార్యుల సిద్ధాంతం బ్రహ్మనాయణ్ణి ఒక సంస్కర్తగా తయారుచేసింది. మాచర్లలో సుప్రసిద్ధ శ్రీ చెన్నకేశవస్వామి దేవాలయం కట్టించాడు. చెన్నకేశవస్వామి భక్తుడైన బ్రహ్మనాయుడు పల్నాటిని అభివృద్ధి చేయాలని కలలు కని దానికి పాటుపడిన మహనీయుడు. అందరూ సమానమేనని, కులమతాలు మానవులు సృష్టించుకొన్నవేనని చెప్పిన ఆదర్శవాది. ఆ కాలంలోనే అన్ని కుల మతముల వారితో సహపంక్తి (అందరూ కలసి భోజనం చేయడం) నిర్వహించినవాడు. ఇలా కులమత భేదాలు లేకుండా అంతా కలిసి ఒకే పంక్తిలో చేసే భోజనాలనే చాపకూడు అంటారు. ఇదే చాపకూటి సిద్ధాంతం. బ్రహ్మనాయని ప్రధాన ఆయుధం కుంతం. బ్రహ్మనాయుడి కాలములో జరిగిన యుద్ధమైన ఆంధ్ర కురుక్షేత్రముగా ప్రసిద్ధికెక్కిన పలనాటి యుద్ధం తెలుగు చరిత్రలో ఒక ముఖ్య ఘట్టము. పలనాటియుద్ధం ముగిసిన తరువాత గుత్తికొండబిలంలోకి వెళ్లినాడని ఆ ప్రాంతపెద్దలు చెపుతారు.

పల్నాటి రాజులకు మూల పురుషుడైన అనుగురాజు హైహయ రాజవంశానికి చెందిన వాడు. మధ్యప్రదేశ్ లోని జబల్ పుర్ ప్రాంతంనుంచి సైన్యంతో తెలుగునాడుకు వలస వచ్చిన ఈయన కార్త వీర్యార్జునుడి సంతతికి చెందిన వాడుగా చరిత్రకారుల భాష్యం. ఈయన ఆంధ్రా, కోస్తా తీరంలోని చందవోలును పాలిస్తున్న వేలంటి చోళునితో తలపడతాడు. ఈ కయ్యం వియ్యంగా మారుతుంది. అనుగురాజు చందవోలు రాకుమారి మైలమ దేవిని వివాహమాడిన కారణంగా పల్నాటి రాజ్యం పొందుతాడు. అనుగురాజు తెలుగు భాషకు, సంస్కృతి వ్యవహారాలకు కొత్త కావడంతో విజ్ఞుడయిన, అపార అనుభవం ఉన్న దొడ్డనాయుడిని మంత్రిగా నియమిస్తారు. ఈ దొడ్డనాయుడి పెద్ద కుమారుడే బ్రహ్మనాయుడు. అనుగురాజుకు ఇద్దరు భార్యలు. మొదటి భార్య సంతానం నలగామ రాజు, నరసింహ రాజు. రెండవ భార్య సంతానం మలిదేవుడు, ఆయన సోదరులు. అనుగు రాజు మరణించే నాటికి మలిదేవులు చాలా చిన్న వయస్కులు. అనుగురాజు తర్వాత నలగామ రాజు పల్నాడు సీమకు ప్రభువయ్యాడు. ఆయనకు తోడుగా నరసింహరాజు ఉన్నాడు. వీరి పాలనలో కూడా మహామంత్రిగా బ్రహ్మనాయుడే కొనసాగాడు. బ్రహ్మనాయుడు మాచర్ల ప్రభువైన మలిదేవులకు మంత్రిగా, రక్షకుడిగా వెళ్ళాడు. తరతరాలుగా కలసి ఉంటున్న ప్రజల మధ్య రాజ్య విభజన తీరని క్షోభను మిగిలిస్తుందని, రాజ్యాన్ని చెక్కముక్కలు చేయవద్దని విజ్ఞుడైన బ్రహ్మనాయుడు భావించాడు. విభజనను ఆపేందుకు శతవిధాలా యత్నించాడు. విడిపోయిన తరువాత గురజాలరాజు నలగాముడు. ఆయన మంత్రిణి నాయకురాలు నాగమ్మ. ఈమె సకల శాస్త్రాలు చదివిన విదుషీమణి. అస్త్ర శస్త్ర విద్యలలో ఆరితేరిన వీరవనిత. రాజ్యతంత్రం, ఎత్తులు..పై ఎత్తులు వేయడంలో దిట్ట. వీరు వీరశైవుల పక్షాన నిలిచారు. ఇక మాచెర్ల రాజు మలిదేవుడు. ఆయన మంత్రే బ్రహ్మనాయుడు. రెండు రాజ్యాలు విడివడక ముందు రాజ్యాన్నంతటినీ తన బుద్ధిబలంతో, భుజబలంతో కాపాడాడు. విస్తరింపజేశాడు. నలగాముడు, నరసింహులిద్దరూ, నాగమ దేవిని పూర్తిగా నమ్మి ఆమె గుప్పిట్లోకి వెళ్ళడంతో ఇరు పక్షాల మధ్య స్పర్థలు ఎక్కువయ్యాయి. చివరకు రాజ్యం రెండుగా చీలి పోవాల్సిన పరిస్థితి ఏర్పడింది. నలగామునికి గురజాల, సవతి పిల్లలయిన మలిదేవులకు మాచర్ల రాజ్యాలు భాగాలుగా వచ్చాయి. పల్నాడు నుంచి విడిపడ్డ మలిదేవులు బ్రహ్మనాయుడు నేతృత్వంలో మాచర్ల రాజ్యాన్ని సుభిక్షంగానే పాలించారు. వ్యవసాయం, పశుపోషణకు ప్రాధాన్యమిచ్చి రాజ్యంలో శాంతి, సౌభాగ్యాలను వర్ధిల్లచేశారు. బ్రహ్మనాయుడు తన సామాజిక సిద్ధాంతాలను కొనసాగించాడు. అట్టడుగు వర్గాలలో ప్రభువుల పట్ల తిరుగులేని ఆదరాభిమానాలను, మద్ధతును కూడగట్టాడు.

ఈ సమయంలోనే కథ మరో మలుపు తిరిగింది. మలిదేవరాజు కళ్యాణ దుర్గకు చెందిన కలచూరి రాకుమారిని వివాహమాడడంతో రాజ్యాల బలాబలాలు మారాయి. తమ శత్రువులతో మాచర్ల రాజులు స్నేహం కొనసాగించడమే కాక బంధుత్వాలు కూడా ఏర్పరుచుకోవడం నాయకురాలు నాగమ్మకు నచ్చలేదు. అయితే తన పథకాలు బయటకు చెప్పకుండా ఆ వివాహ వేడుకలలోనే కోడిపందాలనే పాచికను విసిరింది. రక్తంలోని కణకణం పౌరుషంతో నిండిన మాచర్ల రాజులను, బ్రహ్మనాయుడుని యుక్తిగా కోడిపందాలకు సంసిద్ధం చేసింది నాగమ్మ. అలాగే కుయుక్తితో ఆ కోడిపందాలలో మాచర్ల రాజులను ఓడిస్తుంది, ఏడేళ్ళ పాటు రాజ్య భ్రష్టులను చేస్తుంది. గడువు పూర్తయిన తర్వాత కూడా మాచర్ల రాజ్యాన్ని మలిదేవులకు ఇవ్వకుండా గండి కొడుతుంది. సదా శాంతినే కోరుకునే బ్రహ్మనాయుడు ఈ కారణంగానే, తన పుత్రుడైన బాలచంద్రుడు మత్తుకు, మగువలకు బానిసైపోతున్నా రాజకీయాలకు దూరంగా ఉంచాలన్న ఉద్దేశంతో చూస్తూ మిన్నకుండిపోయాడు. యుద్ధానంతరం హృదయవిదారక దృశ్యం చూసిన బ్రహ్మనాయుడు చలించిపోయాడు. కానీ అప్పటికే జరగాల్సిన నష్టం జరిగిపోయింది. ఒకడు నూరు ప్రాణాలు తీయగలడేమో కానీ ఒక్క ప్రాణం కూడా పోయలేడని బ్రహ్మన్న అనడం ఆయన మానవతావాదానికి అద్దం పడుతుంది. సహపంక్తి భోజనాలు అనే సిద్ధాంతంతో బడుగు, బలహీన, నిమ్న వర్గాలను ఉద్ధరించాడు. వర్ణ, వర్గ విభేదాలనే ఉక్కుచట్రాలను వక్కలు చేశాడు.

ప్రతిరోజు ఉదయం 5:30 గంటలకు మాచర్ల-భీమవరం, మధ్యాహ్నం1 గంటకు మాచర్ల నుండి నడికుడి,సాయంత్రం 4:30 గంటలకు మాచర్ల - తెనాలి వరకు రైలు సౌకర్యం ఉన్నది.










మాచర్ల నుండి పల్నాడు జిల్లా కేంద్రమైన నరసరావుపేటకు బస్సులు బాగా అందుబాటులో ఉంటాయి. మాచర్ల నుండి గుంటూరు నగరానికి మాత్రమే కాకుండా హైదరాబాదు, బెంగుళూరు, తిరుపతి,ఒంగోలు, వంటి పలు ప్రాంతాలకు నేరుగా బస్సు సౌకర్యం ఉన్నది.




రింగ్ రోడ్డు సెంటర్లో రేడియో కేంద్రము






1900లో నిర్మించబడిన తహసిల్దార్ ఆఫీస్




ప్రజలకు మెరుగైన సేవలు అందిస్తున్నది. నేరుగా ఫిర్యాదులు తీసుకోవడం మాత్రమే కాకుండా సోషల్ మీడియాలో వచ్చిన ఫిర్యాదులను కూడా సత్వరమే పరిష్కరిస్తున్నారు. పట్టణంలో మంచినీటి సౌకర్యం కోసం ప్రతి వార్డులో బోర్లు వేయించారు. సాగర్ కుడి కాలువ ద్వారా క్వారిని నీటితో నింపి, శుద్ధి చేసి పైపులైన్ ద్వారా పట్టణానికి నీటిని అందిస్తున్నారు.

మేజర్ పంచాయతీ స్థాయినుండి పురపాలకసంఘంగా 19-11-1987లో రూపాంతరం చెందింది. పట్టణంలో 31 వార్డులున్నాయి. క్లీన్ మాచర్ల గ్రీన్ మాచర్ల నినాదంతో కమిషనర్ రమణబాబు ఆధ్వర్యంలో జాతీయ స్థాయిలో స్కోచ్ అవార్డు మాచర్ల మున్సిపాలిటీకి 2023వ సంవత్సరంలో వచ్చినది. పట్టణంలో సచివాలయాల ద్వారా



## మాచర్ల పురపాలక సంఘం
## చైర్మన్/స్పెషల్ ఆఫీసర్

| | | | |
|---|---|---|---|
| 1. | శ్రీ.జే.రంగయ్య, B.A | స్పెషల్ ఆఫీసర్ | 19-11-83 TO 25-2-84 |
| 2. | శ్రీ.సి.నాగరాజారావు, M.A | స్పెషల్ ఆఫీసర్ | 14-7-84 TO 2-6-86 |
| 3. | శ్రీ.పి.కృష్ణమూర్తి, B.A | స్పెషల్ ఆఫీసర్ | 12-6-86 TO 1-10-86 |
| 4. | శ్రీ.ధర్మసింగ్, B.A | స్పెషల్ ఆఫీసర్ | 2-10-86 TO 31-3-87 |
| 5. | శ్రీ.కె.శంభు ప్రసాద్, B.Sc | ఛైర్‌పర్సన్ | 1-4-87 TO 31-3-92 |
| 6. | శ్రీ.బి.డేవిస్, B.A | స్పెషల్ ఆఫీసర్ | 1-4-92 TO 31-5-93 |
| 7. | శ్రీ.వి.కమలాకరరావు | స్పెషల్ ఆఫీసర్ | 1-6-93 TO 18-3-94 |
| 8. | శ్రీ.డి.వి.రమణారావు | స్పెషల్ ఆఫీసర్ | 8-4-94 TO 29-3-95 |
| 9. | శ్రీ.కూనిశెట్టి వెంకటేశ్వర్లు | ఛైర్‌పర్సన్ | 29-3-95 TO 28-3-2000 |
| 10. | శ్రీ.షేక్.చత్తు సాహెబ్ | ఛైర్‌పర్సన్ | 29-3-2000 TO 18-3-2005 |
| 11. | శ్రీ.ఆర్.మల్లిఖార్జునరావు | స్పెషల్ ఆఫీసర్ | 29-3-2005 TO 30-9-2005 |
| 12. | శ్రీ.బత్తులపడుకొండలు | ఛైర్‌పర్సన్ | 30-9-2005 TO 27-9-2008 |
| 13. | శ్రీ.పోలిశెట్టి అనంత శ్రీనివాసరావు | ఛైర్‌పర్సన్ | 4-10-2008 TO 29-11-2008 |
| 14. | శ్రీ.కామనబోయిన కోటయ్య | ఛైర్‌పర్సన్ | 29-11-2008 TO 30-4-2010 |
| 15. | శ్రీ.డి.చైతన్య | స్పెషల్ ఆఫీసర్ | 1-5-2010 TO 4-5-2013 |
| 16. | శ్రీ.డి.ఆంజనేయులు | స్పెషల్ ఆఫీసర్ | 4-6-2013 TO 10-9-2013 |
| 17. | శ్రీ.టి.శ్రీనివాసరావు | స్పెషల్ ఆఫీసర్ | 11-10-2013 TO 3-7-2014 |
| 18. | శ్రీమతి గోపవరపు శ్రీదేవి | ఛైర్‌పర్సన్ | 4-7-2014 TO 3-8-2016 |
| 19. | శ్రీమతి నెల్లూరి మంగమ్మ | ఛైర్‌పర్సన్ | 4-8-2016 TO 20-7-2018 |
| 20. | శ్రీమతి షేక్ షాకిరుణ్ | ఛైర్‌పర్సన్ | 21-7-2018 TO 29-6-2019 |
| 21. | శ్రీ ఎస్.శివయ్య | స్పెషల్ ఆఫీసర్ | 29-7-2019 TO 31-8-2020 |
| 22. | డా.శ్రీ పూరిబిండి శ్రీనివాసరావు (B.V.Sc&A.H, PG DAEM) | స్పెషల్ ఆఫీసర్ | 23-10-2020 TO 17-3-2021 |
| 23. | శ్రీ.తురక కిషోర్ | ఛైర్‌పర్సన్ | 18-3-2021 TO 1-12-2023 |

24.శ్రీ.బోయ రఘురామిరెడ్డి. 2-12-2023 నుండి



ఒకప్పుడు కెసిపి ఫ్యాక్టరీకి సిమెంటు తయారీకి అవసరమైన రాతి కోసం త్రవ్విన క్వారీ ఇది. తర్వాత దీన్ని మున్సిపాలిటీకి అప్పగించారు.

# శ్రీ లక్ష్మీ చెన్నకేశవస్వామి ఆలయం





దేవాలయం వద్ద లభించిన శాసనాల ప్రకారం త్రేతాయుగంలో కార్తవీర్యార్జునుడు ప్రతిష్ఠించినట్లు స్థలపురాణం.పట్టణంలో చంద్రవంక నది ఒడ్డున ఉంది.1113లోశైవదేవాలయంగా నిర్మించబడింది.కాలక్రమేణా ఆదిత్యుడు మరియు, రెడ్డిరాజు పేరూరిముక్తిరాజులు ఆలయాన్ని పునరుద్ధించారు.బ్రహ్మనాయుడు ఆలయాన్ని అభివృద్ధి చేసాడు. ప్రారంభంలో శైవదేవాలయంగా బ్రహ్మనాయుడు కాలంలో వైష్ణవ దేవాలయంగా మార్చబడింది.హైహవ వంశీయులు ఈ ప్రాంతాన్ని పాలించినట్లు తెలుస్తుంది.శ్రీనాధుని పల్నాటి చరిత్ర ఇక్కడి ప్రాధాన్యతను తెలియజేస్తుంది.శ్రీనాధుడు పల్నాటి వీరచరిత్రను ఈ ఆలయం నుండే రచించడం ప్రారంభించాడట.ఈ ఆలయంలో మంటప స్తంభాలు చోళరాజుల కాలంనాటి శిల్పకళాశోభకు సాక్ష్యాలు.రంగ మండపంలోని నాలుగు స్తంభాలపై భారత, భాగవత, రామాయణ గాథలు మనోహరంగా చెక్కి ఉన్నాయి. ఇక్కడి శిల్పశైలి హనుమకొండలో వేయిస్తంభాలగుడిశిల్పకళనుపోలి ఉంటుంది.గర్భాలయం,అంతరాళాల చుట్టూ ప్రదక్షిణ చేయడానికి పది స్తంభాలతో ప్రదక్షిణాపథం ఏర్పరిచారు.పదహారు స్తంభాలతో గర్భాలయాన్ని అప్పటి శిల్పులు మనోహరంగా మలిచారు.గర్భగుడి ముందు ఉన్న రంగమండపంలో నాలుగు రాతి స్తంభాలు ఉన్నాయి. వాటిపై శ్రీ మద్భాగవతము, శ్రీమన్నారాయణ అవతారము, శ్రీ మహాభారతం, శ్రీమద్ రామాయణం గాథలను అద్భుతంగా చెక్కబడి ఉన్నాయి.ఈ శిల్పకళా నైపుణ్యం చోళ శిల్పకళను పోలివుంటుంది.


రంగమండపం



## బలిపీఠం

బ్రహ్మోత్సవాల సమయంలో బలి కార్యక్రమాన్ని నిర్వహిస్తారు. ముందు ఉన్న ధ్వజస్తంబ ముందుబాగాన,నాలుగు అడుగుల ఎత్తులో ఉన్నది.

### కప్పక స్థంభం

గుడి బయట గరుడ ధ్వజ స్తంభాన్ని ప్రతిష్ఠించు సమయంలో దాని పై భాగం కొంత విరిగింది. ఆ విరిగిన భాగమును దేవాలయ ఆవరణ లోపన ధ్వజస్తంభం పక్కన ప్రతిష్ఠించారు.కప్పక స్తంభం.



## ధ్వజ స్థంభం

త్రిపురాంతకపురానికి చెందిన పాలుట్ల తిరుపతయ్య కుమారుడు ఓబన్న గుడి ముందు బయట ధ్వజస్తంభం 1566/1644లో ప్రతిష్ఠించారు.



స్వామివారి బ్రహ్మోత్సవాలులలో మొదటి రోజు నుండి వరుసగా అంకురార్పణ, ధ్వజారోహణం, కళ్యాణోత్సవం, హనుమద్వాహనం, శేషవాహనం,గరుడవాహనం,రవిపొన్నవాహనం,రథోత్సవం, అశ్వవాహనం,శుకవాహనం, పుష్పయాగం, ద్వాదశ ప్రదక్షిణలు,ఏకాదశ కలశస్థాపన,పవళింపుసేవ యిలా 15 రోజులపాటు జరిగిన తరువాత 16వ రోజు బ్రహ్మోత్సవాలు ముగుస్తాయి.

# బ్రహ్మోత్సవాలు







రాష్ట్రంల్లోనే పెద్దది (ఎత్తు) కలిగినదిగా చెన్నకేశవస్వామి రథం పేరెన్నికకలది.బ్రహ్మోత్సవాలలో భాగంలో జరుగు రథోత్సవానికి వేల సంఖ్యలో భక్తులు తరలివస్తారు. సా.శ.1880కు ముందు శ్రీదేవి, భూదేవి సమేత చెన్నకేశవస్వామికి కళ్యాణం ఐదు రోజులు మాత్రమే నిర్వహించి తెప్పోత్సవం జరిపేవారు. బ్రహ్మోత్సవ ఘట్టాలలో రథోత్సవం ప్రత్యేక ఆకర్షణగా నిలుస్తోంది. 142 ఏళ్లుగా ఇది ఎంతో ఆడంబరంగా జరుగుతోంది. రాష్ట్రంలో రెండో అతిపెద్ద రథంగా చెన్నుని రథం పేరొందింది. 1879లో దుర్గి వాస్తవ్యుడు కుచనపల్లి నారాయణ పంతులు 60 అడుగుల ఎత్తు, ఆరు అంతస్తులతో రూ. 10 వేలు వెచ్చించి చెన్నకేశవ రథం రూపొందించారు. 1880 ఏప్రిల్ 29న ప్రథమ రథోత్సవం నిర్వహించారు. సా.శ.1880లో రథం నిర్మాణం అయిన తరువాత అప్పటి నుంచి రథోత్సవం నిర్వహిస్తున్నారు. ప్రతి సంవత్సరం చైత్ర శుద్ధ త్రయోదశి నుండి స్వామి వారికి జరిగే బ్రహ్మోత్సవాలలో భాగంగా చైత్రబహుళ పూర్ణిమనాడు (చిత్తానక్షత్రంలో) కళ్యాణం, ఆ తరువాత ఐదవ రోజు చైత్రబహుళ పంచమి నాడు రథోత్సవం జరుగుతుంది. ఈ రథోత్సవం తిలకించటానికి రాష్ట్ర నలుమూలలు నుంచి భక్తులు, సందర్శకులు అధిక సంఖ్యలో మాచెర్లకు వస్తారు.

# ఓటిగుళ్ళు





పలనాడులో బ్రహ్మనాయుడు, మలిదేవుల పాలనకు పూర్వం, జైనులు ఈ ప్రాంతంలో ఓటిగుళ్లను కట్టించారు. మూలవిరాట్ లేకుండా దేవాలయం మాత్రమే ఉండే వాటిని ఓటిగుళ్లుగా పిలుస్తారు. ప్రస్తుతం మాచర్ల ఆదిత్యేశ్వర ఆలయంలో శిథిలమైన గుడిని ఓటిగుడిగా ప్రముఖ రచయిత గుర్రం చెన్నారెడ్డి తన పలనాటి చరిత్ర పుస్తకంలో రాశారు. దేవళమ్మ చెరువు సమీపంలోని కట్టడం కూడా ఓటిగుడిగా ఆయన పేర్కొన్నారు.



# ఆధిత్యేశ్వరాలయం

సా.శ. 1111లో హైహయ చాగి బేతరాజు కాలంలో శ్రీధరుని కుమారుడు ఆధిత్యుడు ఈ ఆలయాన్ని నిర్మించి, సా.శ. 1113లో ఆలయం ముందు భాగంలో నాగశిలస్తంభ శాసనం వేయించాడు. కొందరు పేర్కొన్నట్లుగా ఆధిత్యేశ్వరాలయాన్ని బ్రహ్మనాయుడు చెన్నకేశవాలయంగా మర్చలేదని శ్రీ లక్ష్మీచెన్నకేశవ స్వామివారి దేవస్థానం, మాచర్ల. పుస్తకంలో



రచయిత చిరతనగండ్ల సోమేశ్వరరావు పేర్కొన్నారు. ఇందుకు సాక్ష్యంగ నాగశాసనమే అని తెలిపారు. ఆధిత్యేశ్వరాలయంమే కాలక్రమేనా గిరేశ్వరాలయంగా రూపాంతరం చెందినట్ల పుస్తకం పేర్కొన్నాడు. సా.శ. 1935 ఫిబ్రవరి 21 గురువారం కర్నాటి హనుంమంతరామయ్య అతిని సినతండ్రి హనుమయ్యలు దేవాలయం మండపాదులు శిథిలమై పోవుచుండగా మండపము, చప్టాలు ఊడదీయించి గిరేశ్వరుడు గర్భగుడి ఇరువైపులా భ్రమరాంబ, గణపతి గర్భాలయాలను కట్టించి య.13.50 సెంట్లు భూమిని స్వామివారికి నిత్యనైవేద్య దీపోత్సవములు జరుపుటకు మాన్యంగా సమర్పించారు. దీనికి సంబంధించి ఆలయం ముందు ఎర్రరాతిరాయి శాసనం వేయించాడు.



తెల్లని పాలరాతిపై నాగశిలాస్తంభ శాసనం శ్రీ లక్ష్మీచెన్నకేశవ స్వామి దేవాలయం దక్షణంలో గిరేశ్వరాలయం ముందు నాలుగు వైపులా 94 వరసలతో చెక్కబడిన ఈ శాసనం నేటికి ఉంది. ఈ శాసనాన్ని శా.శ 1033 (సా.శ. 1111) మేడాంబిక కుమారుడు వారకాముడు పరిపాలన కాలంలో శ్రీధరుడు-భోగమాంబిక కుమారుడు ఆదిత్యడనునతను మహాదేవితటాక (మాచర్ల) యను పట్టణములో ఆధిత్యేశ్వరాలయం నిర్మింరినాడు.దేవాలయం నిర్మించిన తరువాత రెండు సంవత్సరములకు శా.శ.1035/సా.శ. 1113లో వేయించెను.ఆధిత్యుడు నిర్మించిన దేవాలయమునకు 300 గ్రామం గల పల్నాడు (పల్లి దేశ శతత్రయాన్వస్తరి) రాజ్యమందు సచ్చేయపల్లి గ్రామంలో 200 నిర్తనాల భూమిని సాగి బేతరాజు కానుకగా ఇచ్చాడు. దేవాలయం నర్మించిన శిల్పులు తిప్పోజు, పాతోజు, నారోజు లకు మహాతటాకానకి దక్షణమున 60 నివర్తనాల భూమిని దానంగా ఇచ్చారు. ఈ శాసనం ప్రకారం హైహయ సాగి మేత 1- మేడాంబిక వివాహం, వారి కుమారుడు వీరకాముని గురించి, అతని కుమారుడు సాగిబేత-2 గురించి తెలియను.





నాగశిలాస్థంభ శాసనం



ఎర్రరాతిరాయి శాసనం



గిరీశ్వరాలయములో శిల్పకళ



# శ్రీ వీరభద్రస్వామి దేవాలయము



**శీ వీరభద్రస్వామి దేవాలయం (శ్రీ భద్రకాళీ సమేత వీరభద్రస్వామి దేవాలయం,శ్రీ కామేశ్వరి సమేత ఇష్ఠకామేశ్వరస్వామి దేవాలయం)**



రాష్ట్రంలో గొప్ప విశిష్టతగల దేవాలయంగా పేరెన్నికగలది. ఇది 8-14 శతాబ్ధాల నడుమ నిర్మించబడినది. మాచర్ల పట్టణంలోని ప్రసిద్ధ శ్రీ లక్ష్మీ చెన్నకేశవ స్వామి దేవాలయం ప్రక్కన దక్షణం వైపున కలదు. భద్రకాళీసమేత వీరభద్రస్వామి దేవాలయమును మాచర్లకరణం(దేశ్ పాండ్యా)రామరాజు కట్టించారు.శ్రీలక్ష్మీ చెన్నకేశవస్వామి దేవాలయం నిర్మించిన నాలుగు వందల సంవత్సరాలకు సా.శ. 1450లో ఈ గుడి నిర్మాణం జరిగింది.

దేవాలలంలో వీరభద్రస్వామి మూలవిరాట్ నిలువెత్తు ఉంటుంది. గర్భగుడి ముందుగల రంగమండపం నాలుగు స్తంభాలుతో ఉంటుంది. ఈ మండలం పై కప్పు పై గొప్ప శిల్పకళ, చిత్రకళ ఉన్నాయి. ఆలయము పై కప్పు భాగం మొత్తం గొప్ప చత్రకళ దర్శనమిస్తుంది. వీరభద్రుదడి చరిత్ర, భాగవత,



రామాయణం, భారతం, గణనాధుని చరిత్రలకు చిత్రలేఖనం ద్వారా అందంగా ఆలయ పై కప్పు భాగాన్ని తీర్చిదిద్దారు. ఈ రంగు రంగుల చిత్రములను ఆనాడు వివిధ రకాల ఆకుల పసరులతో వేశారని ప్రతీతి. రంగమండపం మధ్యలో కింద భాగాన ధర్మపీఠం ఉంది. ఆలయ ప్రహరిగోడలకు అద్భుతమైన శిల్పకళ చెక్కబడి ఉంది. అయితే ఆలయంలోని చిత్రకళ, గోడల పై శిల్పకళ చాలా వరకు శిథిలమైవుంది. ఈ ఆలయ ఆవరణలో శ్రీ కామేశ్వరీ సమేత ఇష్ఠకామేశ్వరస్వామి దేవాలయం, మహాలక్ష్మీ, శనేశ్వర, సుభ్రమన్నేశ్వరస్వామి ఆలయ గర్భగుడి ముందు ఉన్న రంగమండపం మధ్యలో కింద భాగాన గుండ్రని ఆకారంలో ఎర్రరాయి పరచబడి ఉంటుంది. దీనినే ధర్మపీఠము అంటారు. పూర్వంలో నేరం చేసిన వారు ఎంత శిక్షించినా నిజం చెప్పకపోతే ఈ ధర్మపీఠం రాయి పై వీరభద్రునికి ఎదురుగా నిలబెడితే వారంతట వారే నిజం చెప్పేవారని ప్రతీతి.వీరభద్రస్వామి దేవాలయం ముందు ఉన్న ఈ ఎర్రరాతి శాసనం.

ఈ శాసనం వెనుక భాగంలో వీరభద్రస్వామి కట్టించిన కాంట్రాక్టరు కర్ణాటకు చెందిన కాన్వాజుపోతినేని మూరకొలత. శాసనం చెక్కినబడిన కాన్వాజు పోతినేని అనే అతని మూరకొలత (25న్నర అంగుళాలు,65 సెం.మీ)



ఎర్రరాతి శాసనం

## శ్రీ కామేశ్వరీ సమేత ఇష్ఠకామేశ్వరుని ఆలయం

ఈ దేవాలయమును చోళరాజుల కాలంలో చౌడప్ప అనే స్థానిక రాజు కట్టించారని, ఈ దేవాలయం ఈ ప్రాంగణంలోని అన్ని దేవాలయాల కంటే ముందుగా నిర్మించారని, చిరతనగుండ్ల. సోమేశ్వరరావు పేర్కొన్నారు.





# రామప్ప దేవాలయం

మాచర్ల నుండి జమ్మలమడక వెళ్లే దారిలో రామప్ప దేవాలయం పరుశురాముడు ఆలయాన్ని నిర్మించాడని చరిత్ర చెబుతుంది. ఆలయ ప్రాంగణంలో శివపార్వతుల విగ్రహాలు విశాఖపట్నంలోని కైలాస శిఖరంపై ఉన్న ప్రతిమను పోలి ఉంటాయి.ఆలయం చుట్టూ పచ్చని పొలాలు,ఆహ్లాదకరమైన వాతావరణం మధ్యలో దేవాలయం ఉన్నది.











1927 వ సంవత్సరంలో నిర్మించిన కళ్యాణ మండపం.



అయ్యప్ప స్వామి దేవాలయం



1978 లో నిర్మింపబడిన కోదండ రామాలయం.



ఆంజనేయ స్వామి దేవాలయం,రింగ్ రోడ్



# మహా దేవుని ఆలయం



పట్టణంలోని యాదవుల బజార్, క్వారీ ఒడ్డున గతంలో ఒక జైన బసగది ఉండేది. జైనులు ధ్యానం చేసుకోవడానికి వీటిని ఉపయోగించేవారు. కాలక్రమేనా అది శిథిలం అవ్వడంతో ఆ గదిని శివాలయంగా మార్చారు. మున్సిపల్ క్వారీ త్రవ్వేటప్పుడు కూడా ఎన్నో జైన మతానికి చెందిన ఆనవాళ్ళు, విగ్రహాలు కనబడ్డాయి.




## పోలేరమ్మ దేవాలయం

1313వ సంవత్సరంలో కాకతీయ దాన శాసనం ఆలయ ప్రాంగణంలో కనిపిస్తుంది.గర్భగుడి ఎదురు ఒక రాతిపై నాలుగు వైపులా జైనతీర్థంకర్ణ చిత్రాలు చక్రబడి ఉన్నాయి . జైన దేవాలయం అని పెద్దలు చెబుతుంటారు. పోలేరమ్మ విగ్రహం ఏర్పాటు చేసి పూజలు చేస్తున్నారు.



1902లో నిర్మించిన ఆంజనేయ స్వామి దేవాలయం



నగరేశ్వర స్వామి



వాసవి కన్యకాపరమేశ్వరి ఆలయం



శ్రీ వెంకటేశ్వర ఆలయం

# జమియా మర్కస్ మజీద్





పట్టణంలో ఔరంగజేబు కాలములో

ఈ మసీదు నిర్మాణం జరిగింది. 1962లో వక్ఫ్ బోర్డ్

ఆధ్వర్యంలోనికి వచ్చింది.










ఈద్గా వద్ద ప్రార్థనలు చేస్తున్న ముస్లిం సోదరులు




1985-86 కాలంలో నిర్మించిన మసీదు, 2012లో పునర్నిర్మాణం

చేయబడి దాదాపు 700 మంది ప్రార్థనలు నిర్వహించే విధంగా ఉన్నది



పిడబ్ల్యూ డి కాలనీలో మసీదు.





లూథరన్ చర్చి

తెలుగు క్రైస్తవ ప్రజానీకానికి సుపరిచితమైన సినిమా కరుణామయుడు. నాడు మాచర్ల రూరల్ మండలంలో కరుణామయుడు సినిమా షూటింగ్ జరుగగా,మాచర్ల పట్టణానికి చెందిన పలువురు ఆ సినిమాలో పాత్రలు పోషించారు. అప్పటి మాచర్ల రైల్వే స్టేషన్ మాస్టర్ జయనందరావు,సినిమాలో సాతాను పాత్రలోనటించారు.తెలుగు క్రైస్తవ సాహిత్యంలో మాచర్ల పాత్ర మరపురానిది.



రోమన్ క్యాథలిక్ మిషన్ చర్చి





తెలుగు బాప్టిస్ట్ చర్చి



పల్నాడు దైవ సేవకుల సహవాసము అనే పాస్టర్ అసోసియేషన్ స్థాపింపబడి మాచర్ల పట్టణమే కాకుండా పల్లె ప్రాంతాలనుండి వచ్చే దైవజనులు ఐక్యంగా క్రైస్తవ సువార్త వ్యాప్తి కొరకు ప్రయాస పడుతున్నారు.



# మాచర్ల ముద్దుబిడ్డలు

## అజయ్ కుమార్ రెడ్డి



అంధుల ప్రపంచకప్ భారతదేశ కెప్టెన్ మాచర్లకు చెందినవాడు.
బాల్యంలో ప్రమాదవశాత్తు ఎడమ కన్ను పోగొట్టుకొనినను, క్రీడలపై మొక్క పెంచుకునే అంచలంచెలుగా రాణించి జాతీయ స్థాయిలో సత్తా చాటుతూ భారత అందులో క్రికెట్ కెప్టెన్‌గాకొనసాగుతున్నాడు.

## కర్పూరపు కోటయ్య



స్వతంత్రం అనంతరం మద్రాసు నుండి ఆంధ్ర రాష్ట్రాన్ని ప్రత్యేకించాలని మాచర్ల నుండి కర్పూరపు కోటయ్య ఉద్యమం చేశారు. టంగుటూరి ప్రకాశం పంతులు గారి ఆధ్వర్యంలో ఆంధ్ర రాష్ట్ర అవతరణ కోసం మాచర్లలో ఎనిమిది రోజులు నిరాహార దీక్ష చేశారు. కావూరు వెంకయ్య, ఆచార్య ఎన్ జి రంగా, గుర్రం మల్లయ్య లతో సన్నిహితంగా ఉండి ఎన్నో కార్యక్రమాల్లో పాల్గొన్నారు. 2023లో మరణించారు.

## ముటుకుల పద్మనాభరావు



ఉపాధ్యాయునిగా, పద్యవిద్యలో పట్టున్న అష్టావధాని,కవిగా,ఆయుర్వేద వైద్యుడిగా పలనాటి వాల్మీకిగా బిరుదుపొందిన వీరు రాసిన పుస్తకాలు పేరుపొందాయి.

### దానం.శివప్రసాద్



25 సంవత్సరాలు పైగా రచనా రంగంలో తనకంటూ ప్రత్యేక ముద్ర వేసుకుని, సమకాలీన అంశాలు,వాస్తవాలు ఆధారంగా ఎన్నో కథలు రాశారు. 32 సంవత్సరాలుగా టీచరుగా పని చేసి, సాహిత్యానికి ఎనలేని సేవ చేశారు.భారతీయ తత్వ శాస్త్రానికి ఆధునీకతను జోడిస్తూ, రామాయణ,భారతం,భాగవతం, ప్రవచనాలు వివరించడం ఆయన ప్రత్యేకత.ఆయన రాసిన వందల కొలది వ్యాసాలు పత్రికలో ప్రచురించబడ్డాయి.తన ఇంటిని ఒక గ్రంథాలయముగా మార్చిన చిరస్మరణీయుడు స్వర్గీయ దానం శివప్రసాద్.

### సాహితీ ప్రియుడు కమలహాసన్

తండ్రి గొప్ప కవి కావడంతో బాల్యము నుండే కళలపై ఆసక్తి పెంచుకొని, వృత్తిపరంగా డాకర్ గా సేవ చేస్తూ, మరొవైపు గత 25 సంవత్సరాలుగా పల్నాడు ప్రాంతంలో ఎన్నో సాంస్కృతిక కార్యక్రమాలు నిర్వహిస్తున్నారు. పల్నాడు ప్రాంతాల్లో కళాకారులను ప్రోత్సహించడానికి ప్రతి సంక్రాంతికి మనం పాడుదాం అనే కార్యక్రమాన్ని నిర్వహిస్తున్నారు.పలు పద్యాలు, కవితలు రాశారు. సంగీతంలో డిగ్రీ పొంది సాహిత్యాభివృద్ధికి కృషి చేస్తున్న సాహితీ ప్రియుడు.

## ప్రజా వైద్యుడు

## డాక్టర్.సింగం శివయ్య



పట్టణంలో పాత మాచర్లలో పేదరావులకు ఆయన చేసిన సేవలకు గుర్తుగా లక్ష్మీదేవి మిద్దెల వద్ద ఆయన విగ్రహాన్ని ఏర్పాటు చేశారు. వైద్య సౌకర్యాలు సరిగా లేని రోజుల్లో సైకిల్ పై పలు గ్రామాలకు వెళ్లి ప్రతిఫలాపేక్ష లేకుండా, పేద రోగులకు సేవ చేసిన మంచి డాక్టర్.

## గిన్నిస్ బుక్‌లో నాట్య కళాకారిణి

శాస్త్రీయ నాట్యంతో, తన నాట్య ప్రతిభతో గిన్నిస్ బుక్ రికార్డులో తన పేరు లిఖించుకున్న వ్యక్తి తమ్మిశెట్టి సీతారాములు.తన ప్రదర్శనలతో మాచర్ల ఖ్యాతి వ్యాపింప చేసిన గొప్ప కళాకారిణి. జాతీయ,రాష్ట్ర స్థాయిలో అనేక అవార్డులను పొందారు.

## రమావత్ తారక శ్రీనివాస్ నాయక్

పట్టణానికి చెందిన శ్రీనివాస్ నాయక్ తెలుగు రాష్ట్రాలలో పేరు పొందిన గొప్ప న్యూరాలజిస్ట్. పదివేలకు పైగా ఆపరేషన్లు చేసి న్యూరోసర్జనగా గుర్తింపు పొందిన డాక్టర్. ప్రస్తుతం హైదరాబాదులో అపోలో హాస్పిటల్‌లో పనిచేస్తున్నారు.

## డాక్టర్ బెజ్జంకి జగన్నాథచార్యులు

పట్టణానికి చెందిన ఈయన ఉపాధ్యాయునిగా కవిగా గుర్తింపు పొందారు. పలనాటి కవుల చరిత్ర అనే శోధన గ్రంథమును రచించారు. వీర రచన వ్యాసంగం తో పాటు కలసి స్వచ్ఛంద సేవా కార్యక్రమాల్లో పాల్గొంటున్నారు.పలనాడు జిల్లా ఉత్తమ కవిగా సత్కారం పొందారు.

## దార్వేముల అనిల్ కుమార్

పట్టణానికి చెందిన అనిల్ కుమార్ తెలుగుపై ఆసక్తితో తెలుగులో పోస్ట్ గ్రాడ్యుయేషన్ విద్యను అభ్యసించటమే కాకుండా పలు వచన కవితలు, పద్య కవితలు,పద్యాలు వ్రాసి కొంతకాలం ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీలో సేవలు అందించి,పలు పుస్తకాలకు సమీక్ష చేశారు. నేటి సమాజానికి అవసరమైన విషయాలను కవితల ద్వారా అందిస్తూ, పలువురి మన్ననలు,పురస్కారాలు పొందుతున్న పల్నాటి యువ కవి.

**మాచర్ల పట్టణంలో దశాబ్దాల పాటు వైద్యం అందించే పేదల హృదయాల్లో స్థిర స్థానం సంపాదించారు డాక్టర్ మోహన్ రావు, డాక్టర్ నరసింహమూర్తి.**

# శ్రీ.కాసు.బ్రహ్మానందరెడ్డి కళాశాలలు



ఇంటర్ కళాశాల



డిగ్రీ కళాశాల

పల్నాడు ప్రాంతంలో దశాబ్దాలుగా వేలాది మంది విద్యార్థుల ఉజ్వల భవిష్యత్తుకు పునాది వేసిన ప్రభుత్వ కళాశాల.పల్నాడు ప్రాంతంలో ఒకప్పుడు ఇంటర్ మరియు డిగ్రీ కళాశాల కలిగిన పట్టణ మాచర్ల మాత్రమే.ఈ కళాశాలలో చదివిన విద్యార్థులు నేడు ఉన్నత స్థాయిలో స్థిరపడ్డారు.పల్నాడు ప్రాంతమంతా పేద విద్యార్థులకు కళాశాల విద్యను అందించిన శ్రీ కాసు బ్రహ్మానంద రెడ్డి ఇంటర్,డిగ్రీ కళాశాల చరిత్ర మహోన్నతం.1966,మే26న పట్టణంలో విశాలమైన స్థలంలో ప్రారంభించబడింది.పేద విద్యార్థులు ఇక్కడ ఇంటర్,డిగ్రీ పూర్తిచేసి అనేక రంగాలలో రాణిస్తున్నారు.ఊరికి దూరంగా ఉన్నప్పటికీ కళాశాల విద్యార్థులతో కళకళలాడేది.2005వ సంవత్సరంలో నాటి ముఖ్యమంత్రి వైఎస్ మాచర్లకి వచ్చినప్పుడు ఇంటర్ డిగ్రీ ఓకే భవనం ఇబ్బందిగా ఉందని చెప్పగా నాటి విద్యార్థుల కోరిక మేరకు ఇంటర్మీడియట్ కొరకు ప్రత్యేక భవనాన్ని ఏర్పాటు చేశారు.ప్రస్తుతం ఇంటర్ మరియు డిగ్రీ కళాశాలకు వేరువేరు భవనాలు ఉన్నాయి.కళాశాల గ్రౌండ్ ఒకప్పుడు రాళ్లతో, ముళ్ళపొదలతో ఉండేది. పక్కనే ఉన్న విశాలమైన మైదానాన్ని పట్టణానికి చెందిన గోపవరపు.నాగేశ్వరరావు, బొడ్డు.చెంచురెడ్డి కళాశాల గ్రౌండ్ బాగు చేయడానికి ఉద్యమించి పలువురి సహాయ సహకారాలతో గ్రౌండ్‌ను అద్భుతంగా ఏర్పాటు చేశారు.పిల్లల కొరకు ఏర్పాటు చేయబడిన ప్రత్యేక పార్కుతో పాటు,వ్యాయామ సాధనాలను ఏర్పాటుచేసి మాచర్ల పట్టణంలో ఆహ్లాదకరమైన వాతావరణం కల్పించారు.








ఎస్ కే బి ఆర్ కళాశాల మైదానం

మాచర్ల పట్టణంలో ఎస్సీ ఎస్టీ బీసీ విద్యార్థుల కొరకు ప్రభుత్వం వసతి గృహాలను అందుబాటులో ఉంచింది. ఎలిమెంటరీ నుండి కళాశాల విద్య అభ్యసించే విద్యార్థులందరికీ వసతి గృహాలు పట్టణంలో ఉన్నాయి.

## విద్యార్థుల వసతి గృహాలు


















గంగాధర్, బి సి కళాశాల విద్యార్థుల హాస్టల్ వార్డెన్.



నూరుల్లా బేగ్, సాంఘిక సంక్షేమ శాఖ కళాశాల,బాలుర వసతి గృహం



గిరిజన సంక్షేమ శాఖ వార్డెన్ రామ్మోహన్ రావు



యన్.రాజేష్,
అసిస్టెంట్ బి.సి. వెల్ఫేర్ ఆఫీసర్

నియోజకవర్గమంతటిలో మాచర్ల పట్టణము విద్యారంగానికి ముఖ్య కేంద్రం. పట్టణంలో జిల్లా పరిషత్ ఉన్నత బాలికల పాఠశాల 1947లో హైస్కూల్ మాచర్లలో ప్రారంభించబడింది. దాదాపు 90 సెంట్లు స్థలములో నిర్మించబడిన ఈ స్కూల్లో ఎందరో విద్యార్థుల ఉజ్వల భవిష్యత్తు ఇక్కడే ప్రారంభించబడింది. 1998 వరకు కలిపి ఒకే స్కూలు ఉండేది. ఆ తరువాత బాలురకు ప్రత్యేక స్కూల్ ఏర్పాటు చేశారు. ఎందరో ఉత్తమ ఉపాధ్యాయ అవార్డులు టీచర్లు పొందుకున్నారు. ఈ స్కూల్లో చదివిన విద్యార్థులు నేడు దేశ విదేశాలలో ఉన్నత స్థానాల్లో ఉన్నారు. పూర్వ విద్యార్థులు స్కూలుకి తమ వంతు కొంత సహకారం అందించగా, నాడు,నేడు పనుల్లో భాగంగా స్కూల్ నూతన శోభను సంతరించుకుంది. జాతీయ స్థాయిలో నిర్వహించే మెరిట్ స్కాలర్షిప్‌కు పలువురు విద్యార్థులు అర్హత సంపాదించారు.



జిల్లా పరిషత్తు ఉన్నత బాలికల పాఠశాల



జిల్లా పరిషత్ ఉన్నత బాలుర పాఠశాల




మండల పరిషత్ ప్రాథమికోన్నత పాఠశాల



కస్తూర్బా గాంధీ బాలికల పాఠశాల

చదువు మధ్యలో ఆపేసిన ఆడపిల్లల కోసం కేంద్ర ప్రభుత్వం ప్రత్యేకంగా ఏర్పాటు చేసిన పాఠశాల. మండాది రోడ్డులో విశాల ప్రాంగణంలో అన్ని సదుపాయాలతో బాలికల కోసం మంచి భవనాన్ని నిర్మించారు. ఆరవ తరగతి నుండి పదవ తరగతి వరకు అలాగే ఇంటర్మీడియట్‌లో స్పెషల్ కోర్స్ అందుబాటులో ఉన్నది. స్కూల్‌తో పాటు హాస్టల్ కూడా ఇందులోనే ఉంటుంది. తల్లి లేదా తండ్రి లేని పిల్లలకు,దివ్యాంగులు,ఎస్సీ,ఎస్టీ విద్యార్థుల అడ్మిషన్లకు అధిక ప్రాధాన్యత.




పట్టణంలో పేద విద్యార్థులకు ఉచిత విద్యను అందించుట కొరకు 2000 సంవత్సరంలో సత్యసాయి విద్యా విహార్ ఇంగ్లీష్ మీడియం ప్రారంభించబడింది. ఎల్కేజీ నుండి పదవ తరగతి వరకు విద్యార్థులకు ఉచిత విద్యతోపాటు సత్ప్రవర్తన,ఆధ్యాత్మిక విషయాలు, క్రమశిక్షణ నేర్పిస్తున్నారు.

# సెయింట్ ఆన్స్ విద్యా సంస్థలు

పౌరుషాలగడ్డ, ,పల్నాటిసీమలో ప్రేమ,క్రమశిక్షణ విలువలతోకూడిన విద్యను అందించడమే లక్ష్యంగా సెయింట్ ఆన్స్ విద్యాసంస్థలు ప్రారంభించబడ్డాయి.పునీత పునీత అన్నంబా ఈ సంస్థ స్థాపకురాలు. మదర్ తాడిపత్రి జ్ఞానమ్మ తన మరణ పడకపై ఉన్నప్పుడు పేదలకు విలువలతో కూడిన విద్య అందించాలని ప్రతి పల్లెకు పాఠశాల,వసతి గృహాలు అందించాలని సందేశం ఇచ్చారు. 1962 ఆగస్టు 15న బాలయేసు పేరున మఠం స్థాపించి మొదటగా ఇంగ్లీష్ మీడియం స్కూల్స్ రాష్ట్రంలో ప్రారంభించారు.ప్రారంభంలో ప్రారంభంలో కొత్తపల్లిలో స్కూలు ఏర్పాటు చేశారు.పనిచేసిన పాఠశాల ఉపాధ్యాయులు సిస్టర్.మేరీ జోష్పిన్ కొత్తపల్లి నుండి మాచర్ల కాలినడకన వచ్చి,మాచర్లలో ఇంటింటికి తిరిగి విద్య విలువలు తెలుపుతూ,పిల్లలను స్కూలుకు పంపించమని అడిగారు.మొదట్లో స్కూల్ భవనం లేనప్పుడు కాలనీలో కొన్ని గదుల్లో తరగతులు నిర్వహించారు.అప్పటికి ఇంగ్లీష్ మీడియం పట్ల సరైన అవగాహన లేదని గ్రహించి తెలుగు మీడియంలో విద్యా బోధన  కొరకు ఆర్.సి.ఎం ప్రాథమిక పాఠశాల చిన్న కాన్వెంట్ ప్రారంభించాలని అనుకున్న పట్టణానికి చెందిన కావూరి వెంకయ్య పాఠశాలకు తన స్థలాన్ని విరాళంగా ఇవ్వగా మరికొంత కొనుగోలుచేసి చిన్న







కాన్వెంట్ప్రారంభించారు తెలుగు ఇంగ్లీష్ మీడియం ఒకే ఆవరణలో ఉన్నందున ప్రారంభంలో కొంత ఇబ్బందిగా ఉందని గ్రహించి తర్వాత వేరువేరుగా స్కూల్స్ నిర్మించారు.బాలికల చదువుపట్ల అనుకూలతలేని రోజుల్లోనే ప్రాథమిక పాఠశాలతో ప్రారంభించి అంచలంచెలుగా ఎదిగి సెయింట్ ఆన్స్ హైస్కూల్ (పెద్ద కాన్వెంట్) స్థాపించారు. 1964 సంవత్సరంలో ప్రారంభించి వేలాదిమంది విద్యార్థిలకు విద్యాదానం చేశారు. జిల్లా,రాష్ట్రస్థాయి పోటీల్లో ఈ స్కూల్ విద్యార్థులు అన్ని రంగాల్లో ప్రతిభను ప్రదర్శించారు. స్కూల్ స్థాపనకు కేసిపి ఫ్యాక్టరీ వారు స్థలాన్ని విరాళంగా ఇచ్చి ఎంతో సహాయం చేశారు.

ఆర్.సి.యం చర్చి ఆవరణలో సెయింట్ జేవియర్ బాలుర ఉన్నత పాఠశాల ద్వారా ఎంతోమంది బాలురకు క్రమశిక్షణతో కూడా విద్యను అందిస్తున్నారు.మదర్ మేరీస్టెల్లా ముందుచూపుతో పట్టణంలో 1987వ సంవత్సరంలో సెయింట్ ఆన్స్ ఇంగ్లీష్ మీడియం స్కూల్ ప్రారంభించబడింది.ఆర్ కే సి అధినేత దత్తు విశాల హృదయంతో  స్థలాన్ని స్కూల్ నిర్మాణం కోసం విరాళంగా ఇచ్చారు. అన్ని రకాల విద్యా సౌకర్యాలతో క్రమశిక్షణతో కూడిన ఉత్తమ విద్య స్కూల్లో అందిస్తున్నారు.

సామాజిక ఆరోగ్యకేంద్రం పట్టణ పెద్దసుపత్రి. ఒకప్పుడు 30 పడకల ఆసుపత్రిగా ఉండగా ఎమ్మెల్యే పిన్నెల్లి.రామకృష్ణారెడ్డి చొరవతో ప్రస్తుతం 50 పడకల ఆసుపత్రిగా మార్చబడి,నియోజకవర్గంలో అందరికీ సేవలందిస్తూ ఉత్తమ సామాజిక ఆరోగ్య కేంద్రంగా అవార్డు పొందినది. పట్టణంలో నెహ్రూనగర్‌లోనూ,గౌడకాలనీలో ఉన్న ఆరోగ్య కేంద్రాలు ప్రజలకు వైద్యంతోపాటుగా రక్త పరీక్షలు ఉచితంగా అందిస్తున్నాయి.






గౌడ కాలనీ ఎంట్రన్స్‌లో ఆరోగ్య కేంద్రం



నెహ్రూనగర్‌లో కోర్టు వెనక ఆరోగ్య కేంద్రం




ఆపదలో ఉన్న వారిని ఆదుకునేందుకు రాష్ట్ర ప్రభుత్వం ఏర్పాటు చేసిన 108 అంబులెన్స్ ద్వారా ఎన్నో ప్రాణాలను నిలబెట్టినందుకు పట్టణానికి చెందిన పెరుమాళ్ల.గురవయ్యకు అవార్డు అందిస్తున్న జిల్లా కలెక్టర్ మరియు జిల్లా ఇన్చార్జి మంత్రి.




ప్రజలకు సౌకర్యాలతో కూడిన వైద్య అందించడంలో క్రిస్టియన్ పబ్లిక్ హెల్త్ సెంటర్ 1959లో ప్రారంభించబడింది. దీనిని మిస్సమ్మ హాస్పిటల్ అని పిలిచేవారు.జర్మనీకి చెందిన క్రైస్తవ మిషనరీ మిస్ ఆన్సర్ లేడీ దీనిని నిర్మించారు.లూథరన్ క్రైస్తవ సంస్థ ద్వారా 1973 వరకు ఈ మిషనరీ వైద్యశాలలో ఆమె స్వయంగా సేవలు అందించారు.

వినోదాన్ని అందించే సాధనాలలో సినిమా థియేటర్లు ప్రముఖ పాత్ర పోషిస్తున్నాయి.పట్టణంలో నాగార్జున కళామందిరం,వెంకటేశ్వర థియేటర్, రామాటాకీస్‌తోపాటుగా పల్నాడు ప్రాంతంలో అత్యంత ఆధునిక సౌకర్యాలతో శ్రీనివాస థియేటర్ విశేషముగా ప్రేక్షకులను ఆకర్షిస్తుంది.


నాగార్జున కళామందిరం


వెంకటేశ్వర థియేటర్



రామాటాకీస్



శ్రీనివాస థియేటర్

ఇంగ్లాండ్లో ఉన్నత విద్యను అభ్యసించి గణితం, తత్వశాస్త్రం,ఇంజనీరింగ్‌లో ప్రతిభను పొందే ఐసీఎస్ కు ఎంపికై అసిస్టెంట్ కలెక్టర్గా సెక్రటరీగా పరిశ్రమల శాఖ డైరెక్టర్ గా కేంద్ర ప్రభుత్వ డిప్యూటీ సెక్రటరీగా నేషనల్ సర్వీస్ లేబర్ ట్రిబ్యునల్ చైర్మన్ పారిశ్రామిక నలహాదారునిగా డెవలప్మెంట్ కమిషనర్ ఆఫ్ మద్రాస్ ప్రభుత్వ ఎక్స్ అఫీషియల్ సెక్రటరీగా పనిచేయుటయే కాకుండా రెండవ ప్రపంచ యుద్ధ సమయంలో తాత్కాలిక టెక్నికల్ పాలిటెక్నిక్ ఇంజనీరింగ్ కళాశాలలో మార్చుట కృషిచేసిన దార్శనికుడు బ్రిటిష్ వారిచే



# కె.సి.పి.సిమెంటు ఫాక్టరీ

భారత సామ్రాజ్య స్నేహితుడు అనే బిరుదు పొందిన వెలగపూడి రామకృష్ణ కెసిపి సిమెంట్ ఫ్యాక్టరీని కె.సి.పి.సిమెంటు ఫాక్టరీ 1958లో మాచర్ల పట్టణంలో నిర్మించారు..ప్రత్యక్షంగానూ పరోక్షంగానూ పట్టణంలో సింహభాగం కె.సి.పి. పరిశ్రమ వలన ఉపాధి పొందారు. నాగార్జునసాగర్ విజయవాడ ప్రకాశం బ్యారేజ్ వంటి ప్రాజెక్టు నిర్మాణానికి కెసిపి వెంటనే ఉపయోగించారు పట్టణంలో పలు సేవా కార్యక్రమాలు నిర్వహిస్తున్నారు.నాగార్జునసాగర్ ప్రాజెక్టుకు, శ్రీశైలం జలవిద్యుత్ ప్రాజెక్టుకు సిమెంటు సరఫరా చేసింది. ప్రస్తుతం దక్షిణభారతదేశంలోనే అత్యధికంగా సిమెంటు ఉత్పత్తిచేసే కర్మాగారాల్లో ఒకటిగావుంది.

## మాచర్ల పట్టణ ముఖ్య అధికారులు

తహసీల్దార్ :9849904027
యం.పి.డి.వో. : 91212 27682
మండల విద్యాధికారి :79015 30713
మున్సిపల్ కమీషనర్.:9849905838
పట్టణ సి.ఐ. :9440796240
ఎక్సైజ్ సిఐ :9959562882
విద్యుత్ శాఖ డి.ఈ. :9440812260
దేవాదాయ శాఖ. :9704436303
ఆర్.టి.సి.డి.యం :9959225432
మునిపల్ ఏ.ఇ. :9849906597
శానిటరీ ఇన్సెపెక్టర్ :7995399661(మున్సిపల్)
వ్యవసాయ శాఖ ఎ.వో. :8886614201
మాచర్ల బస్ స్టేషన్ ఎంక్వైరీ నెంబర్ 08642223900
మాచర్ల రైల్వే స్టేషన్ ఎంక్వైరీ నెంబర్ 0864222255
రామకృష్ణా సేవా సమితి :9440645959




బి.శ్రీనివాస్


చంద్రశేఖర్


రాజేష్


అనిల్


అన్వర్


శివశంకర్


సాయినాథ్

## ది అమరావతి వాయిస్,మాచర్ల నియోజకవర్గం టీమ్.